RMR01A144



# శ్రీ భగవద్గీత

(తెలుగు అనువాదము)

## మంజరీ ద్విపద

"మధుర కవి"
మురకొండ నాగేశ్వరరావు

ప్రచురణ
శ్రీమురకొండ పబ్లికేషన్స్
ఇంకొల్లు - 523 167
ప్రకాశం జిల్లా.

* శ్రీ భగవద్గీత
(తెలుగు అనువాదము - మంజరీ ద్విపద)
**మురకొండ నాగేశ్వరరావు**

* ప్రథమ ముద్రణ
డిసెంబర్ - 2012

* ప్రతులు - 1000

* ముఖ చిత్రం : "శ్రీమురకొండ"

* ముద్రణ :
డాన్‌బోస్కో ప్రింటింగ్ ప్రెస్,
రింగురోడ్డు, గుంటూరు, ఫోన్:2350832

* ప్రతులకు :
**మురకొండ నాగేశ్వరరావు**
శివాలయం వీధి
ఇంకొల్లు - 523 167, ప్రకాశం జిల్లా.
ఫోన్ : **8688282527**

* వెల : రూ. **100/-**

ఈ గ్రంథం
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారి
ఆర్థిక సహాయంతో ముద్రింపబడినది.

# అంకితం



**మాన్యశ్రీ రావిమోహనరావు, కృష్ణకుమారి దంపతులకు**
**శ్రీ భగవద్గీత తెలుగు అనువాదం - మంజరీ ద్విపద**
**సగౌరవంగా సమర్పితము.**

రావి మోహనరాయ! లక్ష్మీ సహాయ
అనుపమగుణధామ! ఔదార్య సీమ

విద్యలో ఘనులైరి వినయంబు మెరయ
వినుతభూషణులైరి విజయాలు కురియ
శిథిలకావ్యోద్ధర్త! సితకీర్తి భర్త
శ్రీ భగవద్గీత స్వీకార కర్త

సుకుమార కబ్బంబు సుకృతికి నిచ్చి
ధన్యుండనైతిని ధరణిలోనేను
ఇద్దానిగైకొని యిహపరాల్ గనుము

ఇంకొల్లు
25-12-2012

కృతజ్ఞతలతో
**మురకొండ నాగేశ్వరావు**

# అక్షరాభినందన



**మాన్యశ్రీ రావిమోహనరావు, కృష్ణకుమారి దంపతులకు**

శ్లో॥ దాంపత్యం శతపత్రమత్రభవతోః యన్మాదృశాళిప్రియం
చత్వారింశదరైః ప్రఫుల్లమముధా సద్వర్ణగంధామృతైః।
శిష్టా షష్టిరిహ ప్రఫుల్లతుతరాం అద్వైతసర్వంకషా
మాంగల్యేన మహోజ్జ్వలాకృతిసుతా పత్రోపపత్రావృతా॥

సీ॥ అంకురార్పణదీక్ష నక్షతవృష్టితో పులకరించిననాడె మొలకయెత్తి
తాళికట్టిననాటి దైవమే అండగా కొమ్మరెమ్మల నీలిగొడుగులెత్తి
మిత్రచంద్రుల ప్రేమ రాత్రిందివము సాగ ఆనందమకరంద మగ్గలించి
ఫలపుష్పలక్ష్మితో కళకళలాడు మీ "బదనిక" వంటి దాంపత్య తరువు

తే॥ "రావి" మూలమునజయమ్ము రంగరించి
సూర్యరమణీయ కృషన్వితార్యమయిన
గ్రంథ కల్యాణ లావణ్యకంబు మెరయ
"కృష్ణమోహనమై" ప్రవర్థిల్లుగాక!

– "మేళ్ళచెఱ్వు"



జ్ఞానపీఠ అవార్డు గ్రహీత, సుప్రసిద్ధ కవి
**డాక్టర్ సి. నారాయణరెడ్డి**
ఎం.ఏ., పి.హెచ్.డి., డి.లిట్.

అధ్యక్షులు
**ఆంధ్ర సారస్వత పరిషత్తు**
తిలక్ రోడ్, హైదరాబాదు - 500 001.
ఫోన్ : (ఆ) 24753724

## హార్దికాభినందన

శ్రీభగవద్గీత నిత్యపారాయణ గ్రంథం. నరునికి నారాయణుడు ఉపదేశించిన దివ్యవాణి గీత. ప్రపంచంలోని ప్రముఖ భాషలన్నింటా అనువదింపబడిన 'వ్యాసగీత'కు, తెలుగులోనూ పద్య, గద్యాత్మకమైన అనువాదాలు లెక్కకు మిక్కిలిగా వున్నాయి.

"మధురకవి' మురకొండ నాగేశ్వరరావు గారు **"మంజరీ ద్విపద"**లో చేసిన అనువాదం మంజుల పదశోభాన్వితమైన సులభ శైలిలో సాగింది. జటిలమైన సంస్కృత శ్లోకార్థాలను తేటతెలుగులోకి తెచ్చిన **"మురకొండ"** వారి లేఖినిలో ప్రవహించిన అనువాద వాహినిలో మచ్చుకు కొన్ని పాదాలు -

"అన్నంబుచే కల్గు నఖిల ప్రాణులును
అన్నంబు వృష్టిచే నావిర్భవించు" - కర్మ యోగము - 13

"కర్మచేయుటచేత కలుగు లాభమును
చేయకుండిన వచ్చు చెట్టయు లేదు" - కర్మ యోగము - 18

"వస్తువులన్ని నావలననే కలుగు
నైనను నేవానియందునలేను
అయ్యవియన్ని నాయందునే కలవు" - విజ్ఞాన యోగము - 12

"సంస్కార గంధమున్న నాగ్వేరరావుగారు గతంలో **"సుబ్బరాయ శతకం"** వ్రాసినట్లు గుర్తు. జ్ఞానవృద్ధులైన నాగేశ్వరావుగారి అనువాదప్రౌఢిమ ప్రశంసనీయం. వారికి నా హార్దికాభినందన.

హైదరాబాద్.
21-12-2012

మీ
[signature]



ప్రముఖ కవి, విద్యావేత్త
**పింగళి పాండు రంగారావు**
యం.ఎ. (ఇంగ్లీషు), యం.ఎ.(పి.ఎ.)., బి.యిడి.
ప్రిన్సిపాల్ (రిటైర్డ్)
ఎ.బి.యం. డిగ్రీ కాలేజి, ఒంగోలు
సి.యం.డి.సి. డిగ్రీ కాలేజి (ఉమన్), ఒంగోలు
ఎ.బి.యం. డిగ్రీ కాలేజి, కావలి.

## అభినందనీయం

'మధుర కవి' శ్రీ మురకొండ నాగేశ్వరరావు గారు 'భగవద్గీత'ను మంజరీ ద్విపదలో సరళ శైలిలో, రసరమ్యంగా వెలువరించడం మిక్కిలి అభినందనీయం. వీరి ఆంధ్రానువాదం మూలానుసరణీయంగా సాగి, తెలుగుకు శోభ తెచ్చినది.

అర్జునునకు లోకోత్తర కాంతిని ప్రసాదించాలనే ఏకైక లక్ష్యంతో శ్రీకృష్ణభగవానుడు అనుగ్రహించిన ఆధ్యాత్మిక బోధల్ని అనువదించడం ఏ వ్యక్తికైనా ధన్యతనుచేకూరుస్తుందనడంలో సందేహం లేదు.

సాత్విక స్వభావులు, నిరాడంబర జీవనులు, ప్రజ్ఞాపాటవాల్ని పుణికి పుచ్చుకున్న నిత్య సాహితీ కృషీవలురు శ్రీ నాగేశ్వరావుగారు. వీరి కలం నుండి వెలువడిన శ్రీశైల దర్శనం, శ్రీ సుబ్బరాయ శతకంవంటి అత్యుత్తమ గ్రంథాలన్నీ సాహితీ వధూటి మణికిరీటాలుగా శోభిల్లుతున్నాయి. స్వయం కృషితో సంస్కృతంలో పట్టు సాధించిన దిట్ట శ్రీ రావుగారు. వీరు గొప్ప చిత్రకారులు కూడా.

స్వామీ వివేకానందులవారు చెప్పినట్లు భగవద్గీత లోకైక మతగ్రంథం. మనసుకు అందని ఈశ్వరుని 'గీత'లో నిర్వచించినట్లు, ఏ ఇతర మత గ్రంథంలోనూ, ప్రపంచంలో ఏ వాఙ్మయంలోనూ చెప్పబడలేదు. ఎవరు ఏ మానసిక, నైతిక, ఆధ్యాత్మిక పరిణామ స్థితిలో ఉండి, ఆ స్థితిలో తనకు

అనుగుణమైన, ఆచరణీయమైన మార్గంకోసం అన్వేషించినపుడు, అత్యుత్తమ మార్గదర్శనం చేయగల ఏకైక జ్ఞాన గ్రంథం భగవద్గీత ఒక్కటే.

పైగా 'ఈ పరమ రహస్యాన్ని వివరించే అతను నాకు ప్రియుడు. నా బోధల్ని అధ్యయనం చేసే అతను జ్ఞానయజ్ఞంతో నన్ను పూజచేస్తున్నట్లే. అసూయలు లేకుండా, శ్రద్ధతో వినే అతను కూడా శుభలోకాల్నిచేరి, నన్నే పొందుగాడు' (18వ అధ్యాయం) అను మహత్తర అభిప్రాయ ప్రధాత శ్రీకృష్ణుడు.

అటువంటి దివ్యప్రబోధమృతాన్ని 'మంజరీ ద్విపద'లో సులభగ్రాహ్యంగా భక్తులకు అందించి, అలరించిన, శ్రీ నాగేశ్వరరావు గారు ధన్యజీవులు. పరమేశుండు వీరిని, వీరి కుటుంబాన్ని, బంధుమిత్రాదుల్ని సదా రక్షించు గాక!

శుభంభూయాత్!!

శుభాకాంక్షలతో

**పింగళి పాండురంగారావు**

సెల్ : 9440554114

ఒంగోలు

10-12-2012

---

● "కృపానిధి" 8-71, లాయర్‌పేట - ఒంగోలు - 523 002

# ఉన్నమాట

నేను శ్రీమురకొండ సుబ్బయ్య శ్రీలక్ష్మమ్మ దంపతులకు 1936 సం॥ ఇంకొల్లులో పేదరైతు కుటుంబములో ఏకైక పుత్రుడనై జన్మించితిని. మా తల్లిదండ్రులు నన్ను 8వ తరగతి వరకు చదివించి పిమ్మట పొలము పనిలో నియోగించిరి. నేను అట్లేయొనర్చుచు, బొమ్మలువేయుట, ఎడ్లకు పనిముట్లు తయారొనర్చుట స్వయముగా నేర్చితిని. అవి పలుచోట్ల ప్రథమ బహుమతులు గూడా పొందినవి.

తరువాత మా యూరిలో 'షేక్' అను మహమ్మదీయుని వద్ద కుస్తీలు నేర్చితిని. యుక్తవయస్సు వచ్చుటచే పెండ్లిచేసికొంటయు జరిగినది. ఆ సమయములో ఊరిలోని యొక నాటక సమాజము వారు నాకు తండ్రిపాత్ర లొసంగు చుండెడివారు. దుఃఖరసఘట్టములలో ననుచూచి ప్రేక్షకులు కంటతడిపెట్టెడివారు.

ఒకసారి, ఆత్రేయగారి ఎన్.జి.ఒ. నాటకములో రంగనాథం పాత్ర వేయుట జరిగినది. అందులో రంగనాథం తన దారిద్ర్యమును భార్య సీతతో చెప్పి దుఃఖించుచు ఆమెను దగ్గరకు తీసికొని భుజముపై తలనాన్చు సన్నివేశమది. నేనట్లే చేసితిని. అదిగాంచి నా భార్య చరచర యింటికిపోయి అలిగి పడుకొన్నది. నాటకానంతరం నేను ఇంటికి వెళ్ళి మధ్యలోనే యెందుకు వచ్చితివన "మీరు పరాయి స్త్రీని తాకితిరి గదా"యని యేడ్వనారంభించినది. అపుడు నేనామె కన్నీరుదుడిచి "ఓసి వెర్రీ! నాటకములో అట్లు చేయవలె గనుక చేసితిగాని నా మనసు కెట్టి చలనము లేద"ని యోదార్చి నాటినుండి నాటక రంగమునకు స్వస్తి చెప్పితిని.

ఇట్లు కొంతకాలము జరుగ, నొక మిత్రుని ప్రోత్సాహమున, **'తెలుగు విశారద'** రాత్రులందు చదివి, పూర్వోత్తర భాగములందుత్తీర్ణుడనయి విజయ పత్రము బొందితిని. ఉద్యోగము లేదు. అపుడు నాకు 36 సం॥లు. ఐదుగురు సంతానము. ఎట్లైన పండితుడనయితిని గదాయని సంతోషముతో రేడియోలో వచ్చు సమస్యల పూరించి గర్వించుచుండ నొకనాడు తిరుపతి వేంకటేశ్వర మహాకవి వరులు రాసిన **"నానా రాజసందర్శనము"** చదువుట జరిగినది.

అందులో "ఆదిభాషయందు అంతోయింతో ప్రవేశము లేనివారికి మేము దండము పెట్టెదము. తెలుగులో దిగవద్దని" అనునది చదివి భయకంపితుడనై సంస్కృత బాలబోధిన్యాదులు చదివి భగవద్గీత శ్లోకాన్వయము గూడ పొందవలెనని దానింజదువ మొదలిడ నాస్తిక స్వభావముగల నేను హఠాత్తుగా ఆస్తికుడనైతిని. తత్ఫలితముగా 77 వసంతాల ఈ వార్ధక్యములో అందరకు సులభమగునట్లు 'మంజరీ ద్విపద'లో భగవద్గీత రచించుట జరిగినది. దీని[redacted] సవరించుటయే గాక ముద్రణాభారముగూడ వహించిన చి॥ డాక్టర్. బీరం సుందరరావు గారి మేలుమరువరానిది. వారికి నా కృతజ్ఞతాభినందనలు తెలుపుచున్నాను.

నేను రచించిన **భగవద్గీత** అనువాదము **"మంజరీ ద్విపద"** ఆమూలాగ్రం చదివి విలువైన మాటలతో హార్దికాభినందలు అందచేసిన ప్రఖ్యాత కవి, జ్ఞానపీఠ పురస్కారం గ్రహీత డా॥ సి. నారాయణ రెడ్డి గారికి వినమ్రంగా ధన్యవాదాలు తెలుపుకొనుచున్నాను.

అట్లే, ప్రముఖ కవి విశ్రాంత ప్రధానాచార్యులు (ప్రిన్సిపాల్) శ్రీ పింగళి పాండురంగారావుగారు ఆత్మీయంగా వ్రాసిన 'అభినందన'కు వందన మందారాలు సమర్పించుకుంటున్నాను.

గ్రంథప్రచురణకు మార్గాన్వేషినైన తరుణములో వెలుగురేఖవలె కన్పించిన పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయమువారి పత్రికా ప్రకటననుచూచి ఆర్థిక సహాయమునర్థించితిని. విశ్వవిద్యాలయము వారు నా అభ్యర్థనను మన్నించి, గ్రంథ ప్రచురణకు ఆర్థిక సహాయమునందించి ప్రోత్సహించినందులకు వారి సౌజన్యమునకు శతథా కృతజ్ఞుడను.

శ్రీభగద్గీత తెలుగు అనువాదము మంజరీ ద్విపద ముద్రణమునకు అడిగినంతనే ఆత్మీయంగా ఆర్థిక సహాయమందించిన వదాన్యులు, సంస్కృతాంధ్ర భాషాభిమానులు, సంస్కృత కావ్యవాఖ్యాన విశారదులు, సహృదములు విశ్రాంత భూగర్భశాస్త్ర ఉపన్యాసకులు శ్రీ రావిమోహనరావుగారికి సర్వదా కృతజ్ఞుడను.

పరిమిత కాలములో గ్రంథమును అందముగా ముద్రించిన గుంటూరు డాన్‌బోస్కో ప్రెస్ యాజమాన్యము వారికి, ప్రెస్ సిబ్బందికి ప్రత్యేక కృతజ్ఞతలు.

నాకు తొలి గురువు మా తండ్రి మురకొండ సుబ్బయ్యగారు. మూడవ తరగతి మాత్రమే చదివిన వారు గజేంద్రమోక్షము, రామదాసు కీర్తనలు, రుక్మిణీ కళ్యాణము వగైరాలను బాల్యంలోనే నాచేత కంఠస్తము చేయించి, నాలో అక్షర బీజాలు నాటిన పితృపాదులకు, పిన తండ్రి మురకొండ శంకరయ్యగారి సహజ పాండిత్య గరిమకు నమశ్శతములర్పించుచున్నాను.

నాకు అక్షరభిక్షపెట్టి, నాలో జ్ఞానజ్యోతిని వెల్గించిన మహనీయ గురువులకు, ముఖ్యముగా "తెలుగు విశారద" చదువుచున్న నాకు ఛందో, వ్యాకరణాది శాస్త్రములు బోధించి, నాపై వాత్సల్య వర్షం కురిపించిన పూజ్య గురువర్యులు "విద్వాన్" శ్రీ పెళ్లూరి బుచ్చయ్య గారికి వినమ్రంగా పాదాభివందనాలు అర్పించుచున్నాను.

ఇక, నా రచనా వ్యాసంగమునకు, చిత్రలేఖనమునకు ఆటంకము లేకుండా సహకరించుచున్న నా అర్ధాంగలక్ష్మి 'స్వరాజ్యలక్ష్మి'కి, కుటుంబ సభ్యులకు-

నాకు ఆప్తమిత్రులు, ఆదర్శ పశుపోషకులు శ్రీ జరుగుల లక్ష్మయ్య చౌదరి గారికి, కరి చంద్రమౌళి, కరి అంకయ్యలకు -

నన్ను గురువుగా సంభావించుచు నాపట్ల ఎనలేని భక్తి, గౌరవాలు చూపు చి॥ ఓరుగంటి సత్యనారాయణ శాస్త్రికి, "సహజకవి" బోడావుల నాగేశ్వరరావుకు, సీనియర్ తెలుగు పండితుడు భువనగిరి పురోషత్తములకు శుభాశీస్సులంద చేయుచున్నాను.

నన్ను కవిగా గౌరవించి, సముచితరీతిన సత్కరించిన వివిధ సంస్థలకు, సాహిత్యాభిమానులకు, నన్ను అభిమానించు ఇంకొల్లు పౌరులకు, నా మేలుకోరు హితులకు, సన్నిహితులకు అందరికీ కృతజ్ఞతా పూర్వక నమశ్శతములర్పించు చున్నాను.

ఇంకొల్లు

25-12-2012.

**- మురకొండ నాగేశ్వరరావు**

# కృత్యాది

శ్రీ గణ నాయకు శ్రీ గౌరి తనయు
విఘ్నము లిడకంచు వినతు లర్పించి
అశ్వధాటి సమానమైన వాగ్ధాటి
వాంఛించి భక్తితో వాగ్దేవి గొలిచి
బంధువధకు జంకు పార్థునకు కృప
గీత బోధించు శ్రీకృష్ణున కెరగి
గైర్వాణమున గీత గ్రథియించినట్టి
వ్యాస మహాముని కంజలి చేసి
కాళికా వరలబ్ధ కవన విరాజి
కాళిదాసునకును కరములు మోడ్చి
ఆంధ్రభాషను కైతనావిర్భ వింప
చేసిన నన్నయన్ చేయెత్తి మ్రొక్కి
కంచుఢక్కను నుగ్గు గావించి నట్టి
శ్రీనాధ కవినాథు చిత్తమందెంచి
పలికింపగా రామభద్రుండు, భాగ
వతమును బల్కిన బమ్మెరన్ బొగడి
ఆధునిక కవుల నగ్ర గణ్యులు తి
రుపతి వేంకటేశ్వర్ల బాహుధానుతించి
మురకొండ సుబ్బయ్య పుత్రుడైనట్టి
నాగేశ్వరుండను నామాంకితుండు
గీర్వాణపు భగవద్గీత నాంధ్రమున
అందరు చదువంగ నర్థమెరుంగ
మంజరీ ద్విపదగా మహి వెల్గునట్లు
రచియింప బూనెను రమ్యంబుగాను
అది యెట్టులన్నచో నాలింపు డింక
భక్తి యుక్తాత్ములు భావంబు లుంచి.

# శ్రీ గీతా మాహాత్మ్యము

విశ్వంభరాదేవి విష్ణువుం జేరి
పరమాత్మ తెలుపుము ప్రారబ్ధకర్మ
మనుభవించెడి వాని కచలమౌ భక్తి
అమరగలదెయంచు నడుగగానపుడు
చెప్పంగ దొడగెను శ్రీవిష్ణుమూర్తి. 1
వినగదే భూదేవి! వివరింతు నిపుడు
ఎవ్వాడు గీతల నెల్ల కాలముల
సద్భక్తి తోడుత చదువునో వాడు
ప్రారబ్ధ కర్మల బాసి మోక్షమును
పొందంగ గల్గును మోదంబుతోడ. 2
వదలక గీత సర్వంబు నెల్లపుడు
ధ్యానంబొనర్చు నభ్యాసకునకును
అధిక పాపాలైన నంటంగ బోవు
అంబువుల్ తామరనంట నట్లుగను. 3
గీత యెందుండునో, గీత యెచ్చోట
భక్తితో పఠియింప బడునో, యచ్చోట
నే ప్రయాగాదిగ నెల్ల తీర్థములు
వచ్చి చేరుచునుండు వరుసగా దేవి! 4
సురలు యోగులు మునుల్ సురుచిరంబుగను
గోపగోపికలు నాగులునును మరియు
నారదోద్ధవులును నయముగా చేరి
తప్పకొనర్తురు తగు సహాయమును. 5
ఎందు గీతాచర్చ లెందు చదువుట
వినుటలు చెప్పుటల్ వెలయంగ గలవొ
ధరణి! నే నందున తన్మయత్వంబు
నందుచు వసియింతు ననవరతమును. 6
ఏను గీతను ఆశ్రయించి ఉన్నాడ
మరియు గీతం గల మానిత జ్ఞాన
దీప్తిచే నేలుదు త్రిభువనములను 7
అస్మదీయము శ్రేష్ఠమైనట్టి గీత

బ్రహ్మరూపము ప్రణవంబును నాశ
రహితమున్, మరి యనిర్వాచ్యంబునగును
సందేహ మిందు లేశంబును లేదు. 8
హర్ష స్వరూపమై యలరెడు నదియు
ఆశ్రితాళికి జ్ఞాన మందించు నదియు
నైనట్టి గీత జనార్దనుడు మును
స్వయముగా బోధించె పాండవేయునకు. 9
చిత్తమున్ చలనంబు చెందనీయకను
సతతంబు గీతను చదువు నాతండు
జ్ఞానంబు గలిగి మోక్షము నందగలుగు. 10
సర్వంబు గీతను చదువలే కున్న
వారలు సగమైన వరుసతో చదువ
దానిచే గల్గుగోదాన ఫలంబు
నిక్కమంచును దేవి! నే వచియింతు. 11
మూడు భాగములందు ముదముతో జదువ
కలుగజేయుచు నుందు గంగాజలాల
నాప్లావముంజేయు నట్టిదౌ ఫలము
ఇంక నారవవంతు నెప్పుడున్ జదువ
అమరుచుండను సోమయాగంబు ఫలము. 12
అధ్యాయ మొకటైన నలరెడు భక్తి
పఠియింప గీతను ప్రతిదినంబునను
రూఢిగా నివసించి రుద్రలోకమున
చిరకాలము సుఖము చెందంగ గలడు. 13
అధ్యాయ మందున ననవరతమును
పఠియించు నాల్గవ భాగమెవండు
వాడు పుట్టుచునుండు వరుసగా నొక్క
మన్వంతరము భువి మానవోత్తముగ. 14
అనుదినంబును గీతయందున్నయట్టి
శ్లోక మొక్కటియైన, శ్లోకార్థమైన
చదువు చుండెడివాడు చంద్రలోకాన
పదివేల వర్షాలు వడయు సౌఖ్యముల.
ప్రాణావసానాన పాయక నెవడు
చదువుచు గీతను చనుచుండగలడొ
ఆతడుత్తమజన్మమందంగ గలడు. 15-16

ఆవిధంబుగబుట్టి యాతండు గీత
మఱిమఱి చదువుచు మరలి రానట్టి
ఉత్తమ మోక్షంబు నొందుచున్నాడు
ప్రాణము గీతశబ్దమును పల్కుచును
వదలిన సద్గతి వచ్చు నిజముగ. 17
ఘోర పాపములున్న కుటిలాత్ముడైన
శ్రద్ధతో గీతను శ్రవణం బొనర్ప
వైకుంఠ పురమును బడసియువాడు
విష్ణు సాయుజ్యాన వెలుగుచు నుండు. 18
ఎన్ని కర్మలొనర్చె నేనియున్ గీత
చదువ జీవన్ముక్తి సమకూడుచుండు
అటుపయి మృతినంది ఆతండు వేగ
పరమాత్మ పదమును బడయుచున్నాడు. 19
జనకుదు మొదలు రాజర్షు లెల్లరును
ఆశ్రయించియు గీత ననవరతమును
పాపాలు సకలంబు వాయంగ పరమ
పదమును లెస్సగా పడచె, భూదేవి! 20
గీతను పఠియించి గీతకుం గలుగు
మాహాత్మ్యముంగూడ మానకెవ్వాడు
పఠియించు చుండునో బాగుగా గీత
తోడుత, నవ్వాడు, దుర్లభంబయిన
మోక్ష పథంబును పొందుచున్నాడు. 21
గీత చదివి మరి గీతకుం గలుగు
మాహాత్మ్య మెవ్వాడు మానునో చదువ
అప్రయోజనమయి అవ్వాని చదువు
కంఠశోష మిగుల్చు ఖచ్చితంబుగను. 22
మానిత గీతా సుమాహాత్మ్య మెల్ల
తెల్పినాడనుగదా తేటతెల్లముగ
ఆరీతి పఠనంబు నాచరించియును
ఫలితంబు మీరలు వడయుడటంచు
ననె సూతముని శౌనకాదుల తోడ. 23

ఇది వరాహపురాణము నందలి
శ్రీ గీతామాహాత్మ్యము
సంపూర్ణము

(1)

# శ్రీ భగవద్గీత

## 1వ అధ్యాయము

## అర్జున విషాద యోగము

ధర్మ భూమియనగ తనరెడు నట్టి
ఆకురు భూమికి నని చేయుటకును
నా వారలును పాండు నందునుల్ చేరి
ఏమొనర్చిరొ నాకు నెరిగించు మంచు
అడుగగా ధృతరాష్ట్రు డనియె సంజయుడు. 1
ఓ కురు కులనాధ! ఓ ధృత రాష్ట్ర!
వినవయ్య చెప్పెద విశదంబుగాను
అపుడు రారాజైనయట్టి నీ సుతుడు
పన్ని వ్యూహంబును పాండవ సేన
నిలచి యుండుట జూచి నిజగురుంజేరి. 2
ఓ బ్రాహ్మణోత్తమా! ఓ గురు దేవ!
తమదు శిష్యుందును తగు బుద్ధియుతుడు
దృపద పుత్రునిచేత తీర్పంగబడిన
వ్యూహంబు నందున యుద్ధంబొనర్ప
చేరిన పాండవ సేనలం గనుడు. 3
ఈ పాండవుల సేన నెంతయో గొప్ప
విలుకాండ్రు పెక్కండ్రు భీమార్జునులకు
పోరున సాటియౌ మొనగాండ్రుగలరు
వారెవరన్నచో వచియింతు వినుడు. 4
యుయుధానుడు, మిగుల యుద్ధకుశలుడు
దృపదుండు, మరియును ధీరుడైనట్టి
దృష్టకేతువు, బలతేజముల్ గలుగు
చేకితానుడును కాశీరాజు, కుంతి
భోజుండు, శైబ్యుండు, పురుజిత్తు, శౌర్య
మహితుండు నగు యుధామన్యుండు, ధైర్య
యుక్తుండు నగు నాతదుత్తమౌజుండు

బలపరాక్రములైన పాండు నందనులు
అనుపమ విక్రముడభిమన్యుడున్ను
ఉప పాండవులుచేరి యుండి రచ్చోట
అందరున్ వీరు మహారథుల్ గారె? 5-6
ఇక మన సేనలో నెల్ల ప్రముఖుల
సేనాధిపతులను చెప్పెదన్ వినుడు.
మీరును భీష్ముండమేయవిక్రముడు
కర్ణుండు, కృపుడు వికర్ణుండు, భూరి
శ్రవుడు, నశ్వత్థామ, సమర నైపుణ్యు
లింకెందరో యుండిరిపుడు నా కొఱకు
జీవితాలర్పణ చేయంగ నెంచి
సమరంబొనర్పగా శస్త్రాలుదాల్చి 7-8-9
ఇట్టి శూరులు గల యీమన సేన
అపరిమితమయి భీష్మాచార్యుచేత
బాగుగా కాపాడ బడుచుండె నింక
పరిమితంబై నట్టి పాండవసేన
వడిముడి తాను కాపాడుచు నుండె 10
కావున మీరెల్ల కడునేర్పు మీర
మీకు నియమితమౌ మేదినిన్ నిలచి
గాంగేయు సర్వదా కాపాడవలయు. 11
అని పల్క కురువృద్ధుడైన భీష్ముండు
రారాజు తోషాన రాజిల్లు నటుల
సింహ నాదమొనర్చి శ్రీఘ్రంబుగాను
పూరించె శంఖంబు భూరివిధముగ. 12
అంత కౌరవసేన యందున్న వారు
భేరీలు శంఖాలు పెద్ద తప్పెటలు
మ్రోగించి నారలు ముదముతోదుతను
ఆ ధ్వని వ్యాపించె నపుడెల్ల కడల. 13
గొప్పదౌ తెల్లని గుఱ్ఱాల తేరు
నందు గూర్చుండియు నా కృష్ణపార్థు
లప్పుడూదిరి దివ్యమౌ శంఖములను
భూ నభోంతరములు భోరుకొనంగ. 14
పాంచజన్యంబూదె వాసుదేవుండు
దేవదత్తంబు నూదెను కిరీటియును

వాయుజుం దూదెను పౌండ్రంబు, ధర్మ
నందనుం దూదె ననంత విజయము. 15
అటుమీదను సుఘోషమనునది నకులు
డటు మణి పుష్పక మా సహదేవు
దూది రంతట, కాశి యుర్వీశ్వ రుండు
ఘన వీరుడైన శిఖండియు, ధృష్ట
ద్యుమ్నుండు, విరటుండు, దోర్బల శాలి
అభిమన్యుడు మరిసాత్యకియును, ద్రుపద
ధరణీశ్వరుండును ద్రౌపదేయులును
శంఖనాదంబులు సల్పిరెల్లెడల
ఆశంఖ సంకులమైనట్టి ధ్వనులు
కంపింప చేసె భూ గగన భాగముల
అది విని నీ సుతుండందె పెన్భయము. 16-17-18-19
అంత కపిధ్వజుండగు అర్జునుండు
అమ్ములు వేసెడి యవసరంబునను
సమరంబు గావింప జనుదెంచియున్న
కౌరవు లంగాంచి గాండివమూని
భగవాను తోడుత పల్కె నీ రీతి. 20-21
కదన మారంభమౌ కాలాన రణము
నే నెవ్వరలతోడ నెరపంగ వలె నొ
వారలందర జూతు పద్మపత్రాక్ష
ఉభయ సేనల మధ్యనుంచునా రధము. 22
దుర్బుద్ధియైన యా దుర్యోధనునకు
ప్రియము గల్పింపగా వేంచేసియున్న
ఈ రణ వీరుల నెల్లరన్ నేను
కనులార నొకసారి గాంచంగవలెను. 23
అంచు పల్కుటతోనె ఆ కృష్ణమూర్తి
అరదంబు రెండు సైన్యాలకు నడుమ
ద్రోణ భీష్ములకు నెదురుగను నిల్పి
పాండవా కురుసేన పరికింపు మిప్పు
డని పల్క, నర్జునుండా రెండు సేన. 24-25
లందున నిల్చినయట్టి బంధువుల,
తాతలన్, తండ్రులన్, తమ్ములన్నలను
గురువులన్, మనుమలన్, కొడుకులన్, మేన

మామలన్, మామలన్, మనుమల, హితుల,
స్నేహితులంగాంచి చెమ్మటల్ గ్రమ్మ
కరుణతో ద్రవియించి కడకు నిట్లనియె. 26-27-28
ఆహవం బొనరంప నరుదెంచి నట్టి
బంధుమిత్రులనెల్ల పరికింప నాదు
అవయవంబులపట్టులణగారుచుండె
చర్మమంతయు మండసాగె భగ్గునను
గగురుపాటు వణకు గల్గెనెమ్మేన
గాండీవ మిదె జారుకరము నందుండి
తడి లేక నోరెల్ల తగ నెండుచుండె
తిరుగుచుండె మనసు తిరమింత లేక
అరదంబుపై నింక నట్టె నిల్వంగ
శక్తుండగాకుంటి సత్యంబు కృష్ణ! 29-30
అంతియే గాకిప్పు డన్ని తావులను
దుశ్శకునాలెన్నొ తోచుచు నుండె
బంధులందర జంపి బవరాన, పిదప
అందబోయెడి శ్రేయ మదియేమిటయ్య! 31
విజయమ్ము నేగోర వినవయ్య కృష్ణ!
కోరును రాజ్యంబు, కోర సౌఖ్యముల.
రాజ్యంబు చేగాని, రహిభోగములును
గాని, జీవితముచే గాని మనలకు
ఏముండు లాభంబ దెంచి చూడంగ. 32
ఎవ్వారి కొఱకునై యీరీతి మనము
ఈ రాజ్యమును సుఖమీ భోగములను
కాంక్షించు చుంటిమో, గాంచంగ నట్టి
బంధువులందరు బవరాన నేడు
ప్రాణాలపై యాశ వదలుచు వచ్చి
సమర భూమిని నిల్చి సన్నద్ధులైరి. 33-34
వారలు నను జంపు వారైన గాని
నే వారలంజంప నిక్కువంబు గను
త్రైలోక్య రాజ్యంబు తగ వచ్చిపడిన;
ఇక భూమి రాజ్యంబు నెంచంగ నేల? 35
ఆతతాయులు నైన ఆ ధార్తరాష్ట్ర
సుతులను జంపంగ, సుఖమేమి మనకు

పాపాత్ములైనను వారలం జంప
మనకు పాపము గల్గు మానకన్ కృష్ణ! 36
కావున, కేశవా! కయ్యంబు లోన
దుర్యోధ నాదుల దునుమాడుటకును
మనము తగుదుమయ్య? మనవారి జంపి
మనము సుఖముగాను మనగల్గుటెట్లు. 37
మిత్రహాని వలన మేదినిం గలుగు
వంశ నాశనముచే వచ్చు పాపాల
తెలియదా రారాజు, తెలిసిన మనము
అట్టి పాపములేల యాచరింపంగ
పూనుకో వలయునో బోధగాకుండె. 38-39
కులము నాశనమైన కులధర్మములును
అంతంబు గాగల వవని లోపలను
కుల ధర్మములు చెడకులము నెల్లెడల
వ్యాప్తిచెందునధర్మ వర్తనల్ మిగుల. 40
అట్టి యధర్మము లభివృద్ధియైన
చెడును కులస్త్రీలు, చెప్పంగ నేల
ఆ కులస్త్రీలు తామారీతి చెడగ
వర్ణసంకరమనివార్యంబు నగును. 41
ఆ వర్ణ సంకరం బందిన కులము
పొంద జేసినవారు పోదురు నరక
వాసంబు చేరగా, భావింప వారి
పితరులకుం జెడు విహిత సద్గతులు. 42
కుల నాశనంబును గూర్చెడి వారి
జాతి సంకర దోషజాలంబు శాశ్వ
తమగు జాతికులపు ధర్మాలు చెడును
అట్టి కులముచెడినట్టి వారలును
జాతి సంకరమును సల్పువారలును
అరుగు నరకమునకని చెప్పవినమె. 43-44
అక్కటా రాజ్యసౌఖ్యాలపై ఆశ
కలిగి సంబంధాల కసిమసంగుటకు
యత్నమొనర్చియు నమిత పాపముల
కొడిగట్టితిమిగదా యోర్పులేకిపుడు. 45
ఆయుధంబును బూని అనిసేయ నట్టి

వాడనౌ ననుపగ వారలాయుధము
లంగొంచు ఖండించ లాభంబటంచు
నెమ్మదిందలచెద నేను శ్రీకృష్ణ! 46
అర్జునుం డారీతి నా కృష్ణుతోడ
పలికియు దుఃఖంబు పట్టంగ లేక
విల్లంబులను ధర వేగమే విడచి
చతికిల బడిపోయె స్యందనంబునను. 47

ఉపనిషత్సారంబు యోగశాస్త్రంబు
నగు భగవద్గీత లందు పార్థునకు
శ్రీకృష్ణ పరమాత్మచే చెప్పబడిన
అర్జునుని విషాదమను యోగమిద్ది
మంజరీ ద్విపదయై మహిని వెల్గొందు.



## 2

# శ్రీ భగవద్గీత

## 2వ అధ్యాయము
## సాంఖ్య యోగము

అప్రకారంబుగా నర్జునుండపుడు
కన్నీరు గార్చుచు కనికరంబునను
వ్యాకులత్వమునొంది వాపోవుచుండ
పరికించి కృష్ణుండు పల్కె నీరీతి. 1
అర్జునా! పామరు లందుండు నదియు,
భువిలోన నపయశమును గూర్చునదియు,
నారకలోకంబునకు జేర్చు నదియు
నైన యీ మోహంబదక్కటా నిన్ను
ఈక్లిష్టసమయాన నెచ్చోటనుండి
అరుదెంచి యీరీతి నావరించినది. 2
శత్రుసంహారకా! సన్నుతచరిత!
అర్జునా! క్లైబంబు నందంగబోకు
తగదు తగదు నీకు; ధర్మయుద్ధంబు
గావింపగా లెమ్ము గాండివ మ్మూ ని. 3
అనిపల్కు కృష్ణున కనెపార్థుడిట్లు
భీష్ముండు, ద్రోణుండు ప్రేమమీరంగ
పూజింప దగువారు పుడమిలో నాకు
అట్టివారల మీద నాహవం బందు
బాణజాలంబెట్లు బరపంగ గలను. 4
అనిలోన గురుల మహానుభావులను
వధియించి యత్తరి వారిరక్తమున
తడిచిన సంపదల్ తగమెక్కుకంటె
భిక్షాన్నమే మేలు విరింప నాకు. 5
మరియు యుద్ధములోన మనమె గెల్చెదమొ
వారలే గెల్తురో వచియింప లేము
ఎవ్వారి హతమార్చి యిద్ధరాస్థలిని

బ్రతుకంగ గోరమో బాగుగా నట్టి
తాతలుం గురువులు తగనుండిరెదుట.
ఆత్మ సుజ్ఞానంబు నరయంగ లేను
ధర్మవిషయములో తగినట్టి దాని
వివరించు మంచును వినయంబుతోడ
అర్థించు చున్నాడ నయ్య శ్రీ కృష్ణ!
శిష్యుండ నీకునే శిక్షించుమయ్య. 6-7
శత్రువుల్ లేనట్టి స్వారాజ్యమైన
స్వర్గాధి పత్యంబు సమకూరియున్న
ఇంద్రియాదులనెల్ల నిట్టె పీడించు
దుఃఖంబు నెయ్యది తొలగింపగలదొ
తెల్పంగవలయును తేటతెల్లముగ. 8
అని కృష్ణుతోదుత నర్జునుండిట్లు
పలుకుచు నిపుడేను బవరంబొనర్ప
జాల నటంచును స్యందనంబునను
చతికిల బడిపోయె సార్వభౌముండ. 9
ఇరు సేనలకుమధ్య నివ్విధంబుగను
విలపించు పార్థుని వీక్షించి కృష్ణ
పరమాత్మ నగుచున్నవాని విధమున
పలుకంగ సాగెను బహుబాగు మీర.. 10
అర్జునా! నీవిప్పు దధిక దుఃఖంబు
నందినాడవు, దుఃఖ మందంగ రాని
వారల గూరిచి, పైపెచ్చు బుద్ధి
వాదంబు తోగూడు వాక్యాల గూడ
పలుకంగ జొచ్చితి పండితు నటుల
ప్రాణాలు వీడిన వారికై గాని
బ్రతికియుండినయట్టి వారికై గాని
పండితు లగువారు వాపోవరెపుడు. 11
ఏనును, నీవునున్, యీయుద్ధ భూమి
నిలిచియుండినయట్టి నేతలుంగాని
పూర్వమందున లేకపోలేదు, యింక
ముందును లేకుండ పోము నిక్కముగ. 12
జీవి దేహానవసించి యుండంగ
బాల్యంబు యవ్వన వార్ధక్యములును

ఏ రీతిగల్గునో, యెంచంగ నటులె
మరణించి నంతట మతియొక్క తనువు
వచ్చుచుందును గాన వగవంగ బోవ
రేపండి తోత్తము లించుకంతయును. 13
శబ్ద స్పర్శాది విషయముల వలన
సొరిదిగా శీతోష్ణ సుఖదుఃఖములును
కలుగుచుందును గాని కనవు సుస్థిరత
కావున చలనంబు గాంచంగ బోకు. 14
ఓ పురుష శ్రేష్ఠ! ఓ కురు వీర!
ఈ శబ్ధ స్పర్శాదులెన్నడే నియును
బాధింపలేవొ యెవ్వానినిన్, సుఖము
కష్టంబు లోకరీతి గాంచంగ గలడొ
అట్టి ధీరుడు మోక్షమందంగ గలడు. 15
నామ రూపములుండి నశియించునట్టి
దేహంబులకునున్కి తెలియంగ లేదు
సత్యమౌ ఆత్మకు చావును లేదు
తత్వజ్ఞు దెరుగును తప్పకన్ దీని 16
ఈ సమస్తపులోక మెద్దాని వలన
వ్యాప్తమైయున్నదో అది నాశరహిత
మైయున్నదని గనుమయ్య నెమ్మదిని. 17
అర్జునా! కన్పించునట్టియా తనువు
లన్నియు నాశంబు లందున టంచు
అప్రమేయంబగు నాత్మ సత్యంబ
టంచు చెప్పంబడె నందుచే నీవు
అనియొనరింపగా నాయత్తపడుము. 18
చంపువాడంచును, చంపంగ బడెడు
వాడటంచు నెవరు భావానదలతు
రట్టివారలు నిజమరయని వారె
చంపంగబడదాత్మ, చంపదెవ్వరిని. 19
ఆత్మ పుట్టగబోవ దంతంబుగనదు
శాశ్వతం బయ్యది జగతియందునను
తనువు నాశనమైన తా నశింపకను
తనరుచుందును ప్పార్థ తప్పకన్ మరియు. 20
ఈ యాత్మ నెవడు తానెరుగునో జనన

మరణరహితునిగ మరినిత్యునిగను
అట్టివా డొరునెట్టులంతం బొనర్చు
అంతంబు చేయించు నన్యుని చేత. 21
చినిగిపోయిన ప్రాత చేలమున్ వీడి
క్రొత్త వల్వను గట్టి కొన్నట్టి రీతి
శిథిలమౌ దేహమున్ చెచ్చెరన్ వీడి
క్రొత్తతనువు జేరుకొనుచుండు నాత్మ. 22
ఆత్మకు ఆదియు నంతంబు లేదు
గాలి కెండదదియు కత్తికిందెగదు
నీటనానదు వహ్ని నీరయిపోదు
నిశ్చలంబయ్యది నిత్యంబటంచు
స్థిరమైనదంచును తెలిసికొమ్మీవు. 23
ఇట్లు తడువకుండ నెండింపబడక
కాల్పంగబడకను గ్రాలు నియ్యాత్మ
సర్వవ్యాపకుడని చక్కబల్కుదురు. 24
కనులతో దంజూడ కానంగ రాదు
చింతించి ననుమది చిక్కంగ బోదు
ఆత్మయంచును పెద్దలనుచుంద్రు గాన
నీవిట్లు దుఃఖంబు నిలుపంగదగదు. 25
అటుగాక అర్జునా, ఆత్మ దేహాల
తోడుత జనియించి తుదముట్టు నంచు
భావించినన్ గాని, పార్థ యీ స్థితికి
గూడ దుఃఖించుట కూడదు నీకు. 26
చచ్చినవానికి జన్మంబునిజము
జనియించువానికి చావునిక్కంబు
అనివార్యమగు విషయంబది గాన
దానికి దుఃఖింప తగదు నీ కింక. 27
పుట్టక పూర్వము భువిగానరావు
కనిపించు పుట్టువున్ గాంచినతోనె
మరణించి నంతట మరి గానరావు
యిట్టి ప్రాణుల గూర్చి యేల శోకింప. 28
ఆశ్చర్యమగు వస్తువట్టుల నొకడు
కనుగొనుచున్నాడు కవ్వడీ! ఆత్మ.
ఆశ్చర్యమగు వస్తువట్టు లింకొకడు

ఆలించు చున్నవా దనవరతంబు
ఆశ్చర్యమగువస్తు వట్టులింకొకడు
వాకొనుచున్నాడు వసుధలో పలను
అట్లుచూచియు చెప్పి ఆలించిగూడ
ఏ యొక్కరుడు నిజమెరుగుట లేదు. 29
అర్జునా! సకల దేహములందు గల్గు
ఆత్మ చంపగబడ దరయంగ నెపుడు
కావున దుఃఖించు కార్యంబు లేదు
ఏ ప్రాణిగూర్చి నీ వించుకంతయును. 30
నీక్షాత్రధర్మంబు నీటిపాల్జేసి
సమరంబొనర్పగా జంకుచున్నావు
ధర్మయుద్ధము కంటె ధాత్రిలోపలను
శ్రేష్టమేముండునో చెపుము రాజులకు. 31
అప్రయత్నంబుగా నమరియున్నదియు
స్వర్గసౌఖ్యంబును సమకూర్చునదియు
నగు రణమెవ్వార లాచరించెదరొ
సుఖవంతు లవ్వారె సుమ్మి నిజముగ. 32
నీవు యుద్ధంబును నిరసింతు వేని
స్వంతధర్మము వీడు వాడవేయౌదు
వందుపాపము గల్గు, నపకీర్తి గలుగు
తప్పకన్, నా మాట తలదాల్పవేని. 33
మరియు నీయపకీర్తి మరచిపోవకను
చిరకాలమును జనుల్ చెప్పుకొంచుంద్రు
గౌరవముగలుగు క్షత్రియునకును
చావుకంటెను దుర్యశంబుబాధౌను. 34
ఏ మహా రథులు నిన్నింత కాలంబు
గొప్పగా భావించుకొనుచుండినారొ
వారెల్ల రిపుడు నిన్ పారుబోతంచు
అవహేళనము చేయ నదియోర్వగలవె. 35
అంతియే గాక నీ అరిమూక నీదు
సామర్థ్యమును నిందసల్ప సాగెదరు
అంతకంటెను మించు నట్టిదుఃఖంబు
మరియొక్కటుండునే మఘవతనూజ. 36
పోరజచ్చిన స్వర్గముంబొంద గలవు

గెల్వ రాజ్యంబు భోగింపంగ గలవు
ఈ రెండు రీతుల నెదియైన మేలె
కల్గించు, గావున కలతలన్ విడచి
సంసిద్ధు డైలెమ్ము సమరంబొనర్ప. 37
అర్జునా, మదిని జయాపజయంబు
లను, మరి యుంగల్గు లాభనష్టములు
సౌఖ్య కష్టంబుల నమముగా నెంచి
అనిసేయ పాపంబు సందకుండెదవు. 38
అర్జునా, సాంఖ్యంబు నందుండు నట్టి
ఆత్మతత్వము నీకు నమర జెప్పితిని
ఇకయోగశాస్త్రాన నిమిడియున్నట్టి
కర్మయోగపు వివేకము చెప్పనుంటి
దాన నీకర్మ బంధాలెల్ల దూలు
నందుచే శ్రద్ధతో నాలింపు మీవు. 39
ఆచరించినఫలమగుపడు చుండు
వదలిననడుమ దుష్ఫలితంబు నిడదు
ఆచరించిన నెవ్వదల్పంబు నైన
కదముట్టుదుఃఖంబు కర్మయోగాన. 40.
కవ్వడీ! కర్మయోగము నాచరించు
పురుషులకున్ నిశ్చయంబగు బుద్ధి
ఒకటిగా నుండును ఒప్పుగా నిలను.
ఇతరుల బుద్ధులనేకముల్ గాను
అంతంబు గనరాని యట్టివై యుండు. 41
అర్జునా! వేదంబు లందున్న యట్టి
ఫలములం దిష్టంబు బాగుగా గలిగి
స్వర్గఫలాదుల వాంఛించు చెపుదు
అంతకంటెను మించు నట్టి దెద్దియును
కనరాదటంచును కలహంబులాడు
మూఢులౌ జనులకు బుద్ధిసుస్థిరత
పొందనేరదు నిక్కముగ ధ్యానమందు. 42-43-44
వేదాలు త్రిగుణాల విషయాల గూర్చి
తెలుపును, నీవట్టి త్రైగుణ్య ములను
మరి ద్వంద్వ యోగ క్షేమంబుల నెల్ల
దవ్వుగా జేసి సత్యమునందుబుద్ధి
వీడనీయక నాత్మవిజ్ఞాని వగుము. 45

స్నానపానములకు స్వల్పములైన
బావినీ రెంతయవసరంబొ చూడ
గొప్పతటాకాన గూడనవసర
మంతెయై యున్నట్లు, అర్జునా గొప్ప
వేదాల యందుచెప్పిన యా సమస్త
కర్మలందెంతగా కల్గునో ఫలము
అట్టి ఫలంబునే అందంగ గలడు
పరమార్థ మెరిగిన బ్రహ్మనిష్ఠుండు. 46
కర్మచేయుట యందె గాండీవి నీకు
ఉన్నది యధికార ముర్విలోపలను
కర్మఫలము నీవు కాంక్షించుటకును
అధికార మేనాటి కరయంగ లేదు
కర్మఫలము కీవు కావుకారణము
నెగడకుండును గాక నీ బుద్ధి కర్మ. 47
ఓయర్జునుండ! నీ వుండియోగమున
సంగంబు సర్వంబు సమయంగ జేసి
ఫలియించినను కర్మ ఫలియింపకున్న
సమదృష్టి తోడుత సల్పెదవేని
నద్దానినే యోగమంచు పల్కెదరు. 48
సమబుద్ధిగల్గు నిష్కామపు కర్మ
కంటె ఫలాపేక్ష గల కామ్యకర్మ
మిగుల తక్కువదౌను మేదినియందు
కావున నిష్కామకర్మకుం దిగుము
అల్పబుద్ధులె ఫలమాశించుచుంద్రు. 49
సమబుద్ధియుక్తుడీ జన్మంబునందె
పాప పుణ్యాల్రెండు బాయంగ గలడు
కావున నిష్కామ కర్మంబు కొరకు
పూర్ణయత్నము చేయ బూనుము నీవు
కర్మలనేర్పు యోగంబంద్రు బుధులు. 50
ఫలితమందున కోర్కె వదలివేసియును
కర్మల నిరతము గడపెడి సమత
గల్గిన బుధులు మోక్షంబుగాంచెదరు
భవమునం గల్గెడి బంధాల ద్రోలి. 51
ఎప్పుడజ్ఞానంబు నెనయదో బుద్ధి
అప్పుడే నీకునో అర్జునా తొల్లి

విన్నవియును, నింక వినబోవునవియు
సకలమౌ విషయాల చయ్యన గలుగు
ప్రబల వైరాగ్యంబు వసుధలోపలను. 52
బహురీతులైనట్టి వాక్యాలవలన
కలగిన నీమది కలతను దీరి
పరమాత్మ ధ్యానాన వసించునపుడె
ఆత్మసాక్షాత్కార మందంగ గలవు. 53
అనిపల్కు కృష్ణునకనె పార్థుడిట్లు
మాధవా! తెల్పు సమాధియందున్న
స్థితప్రజ్ఞుడగువాని స్థితి యెట్టులుండు
ఏ రీతి మాటాడు యేరీతి నడచు
నన పార్థుతోడుత ననెకృష్ణుడిట్లు. 54
మనుజుడెప్పుడు తనమదిలోన నున్న
అభిలాష లన్నిటి నణగార్పగలడొ
ఆత్మచే నాత్మలో నానందపడునొ
అప్పుడాతని స్థిరుండని చెప్పదగును. 55
కష్టాలుకల్గిన కలతనొందకను
సుఖముల మోహంబు చూపబోవకను
అనురాగ భయకోప మనునవి లేని
మననశీలుండగు మనుజుండు తగును
స్థిరుదంచు చెప్ప ధాత్రీతలంబందు. 56
ఎవడుతా విషయాల నెప్పుడేనియును
లేకయుందునొప్రీతి లేశమ్ము గూడ
ఇష్టమనిష్టము లేర్పడి నపుదు
తోషము ద్వేషమున్ తొలగించు కొనునొ
అట్టివాడే స్థిరుండనజెల్లు పార్థ! 57
తనయంగములనెల్ల తాబేలదెట్లు
ముడుచునోలోనికి ముదముతోడుతను
ఆ రీతి యోగీంద్రుడైనట్టి వాడు
తన యింద్రియంబుల తగురీతిగాను
వెనుకకు త్రిప్పునో విషయాలనుండి
అప్పుడాతనిజ్ఞాన మగును సుస్థిరము. 58
శబ్దాది విషయాల సముదాయ మెల్ల
స్వీకరింపనియట్టి జీవికి విషయ
ములు విడిపోవును ముఖ్యంబుగాను

వాని గూర్చినయట్టి వాసనల్ పోక
నిలిచియుండును వాని నెమ్మనమునను
పరమాత్మదర్శన భాగ్యంబుగలుగ
ఆవాసనలు సైత మంతంబుగనును. 59
ఆత్మ దర్శింపగా యత్నంబొనర్చు
పండితుమదినైన ప్రక్కకున్ లాగి
విషయాలలోపడవేయు తప్పకను
ఇంద్రియంబులశక్తి యితింత గాదు. 60
అట్టి యింద్రియముల నన్నింటి మిగుల
చక్కగా వశమున సాధకుండుంచి
ఆత్మయందే మది నరికట్టు నెడల
అపుడె యాతనిజ్ఞానమగును సుస్థిరము 61
వినుపార్థ శబ్దాది విషయాల సతము
చింతచేసెడివాని చిత్తంబు లోన
ఆసక్తి ఉదయించు, నంతనద్దాన
క్రోధంబు గల్గు, నాక్రోధంబు వలన
అవివేకమనునది యావిర్భవించు
అవివేకమున గల్గు నప్పుడు మరపు
మరపుచే బుద్ధియు మరి నాశమౌను
బుద్ధి నాశముచేత పూర్తిగా నిలను
చెడునుతా మానిసి శీఘ్రంబు గాను. 62-63
కాన విషయచింత కడుకుపో నెట్టి
తన యధీనంబున తనరుచునున్న
ఇంద్రియంబులతోడ నిహలోకమందు
అన్నాది విషయంబు లనుభవించుచును
జ్ఞాని శాంతముతోడ సౌఖ్యంబుగనును. 64
మనసు నిర్మలమగు మనుజున కిలను
దుఃఖముల్ సర్వంబు తొలగును వేగ
అంత బుద్ధియు పరమాత్ముని యందు
సుస్థిరత్వమునొందు సులభంబు గానె. 65
ఇంద్రియంబులనొంచ కెవ్వాని కైన
ఆత్మచింతన గల్గ, దయ్యాత్మ చింత
నంబులేనిదెశాంతి నాస్తియౌ మదిని
శాంతి లేకున్నచో సౌఖ్యమెక్కడిది. 66
ఏ యింద్రియము తోడ నేగునో మనసు

అయింద్రియమె జ్ఞానమంతయు దూల్చి
నీటిలో యోడను నిమిషమాత్రమున
ప్రతికూల వాయువు ప్రక్కదారికిని
త్రిప్పెడు రీతిని త్రిప్పి వంచించు. 67
కనుకనో యర్జునా! కాంచంగనెవడు
తనయింద్రియంబుల తగినట్టి రీతి
విషయాల మీదికి వెడలంగ నీక
అరికట్టుచున్నాడొ యతని జ్ఞానంబు
మిగుల స్థిరంబగు మేదినియందు. 68
సామాన్యులకు రాత్రిసమయం బదేదొ
అపుడు మేల్కొనియుండు నయ్య సంయమియు
జనులు మేల్కొనియుండు సమయంబదేదొ
అదియె సంయమికిని నగుచుండు రాత్రి. 69
ఎవడు తా కోరికలెల్లను విడచి
శబ్దస్పర్శాదుల సమయింపజేసి
అహమును మమకారమనునవి లేక
వర్తించునో వాడె పదయును శాంతి. 70
తనయందు నదులెన్ని దబ్బున వచ్చి
చేరిన గాని తా చెదరక నిలచు
కదలి చందంబున కడునిష్ఠయుతుడు
భోగ్యవస్తువులెన్ని పొల్పుగా వచ్చి
పడుచుండి నంగాని పడదుకలతను. 71
బ్రాహ్మీస్థితియనుచు పల్కంగ బడెడు
దీని నెరుగువాడు తిరిగియెన్నటికి
పడబోక మోహాన, పదయంగగలడు
అంత్యకాలమున బ్రహ్మానంద రూప
మోక్షంబు తప్పక ముదముతోదుతను 72
ఉపనిషత్సారంబు యోగశాస్త్రంబు
నగు భగవద్గీతలందు పార్థునకు
శ్రీకృష్ణ పరమాత్మచే చెప్పబడిన
సాంఖ్యయోగ పురహస్యంబగు నిద్ది
మంజరీ ద్విదపయై మహిని వెల్గొందు.

3

# శ్రీ భగవద్గీత

## 3వ అధ్యాయము

## కర్మయోగము

అరయ శ్రేష్ఠముజ్ఞాన మా కర్మకంటె
నంచు నీమదిలోన ననుకొన్నయెడల
ఈ భయంకర యుద్ధమేరీతి గాను
చేయమందువౌనన్ను చెపుము శ్రీకృష్ణ. 1
కలగల్పులైన వాక్యంబుల చేత
కలవరపడు చుండె గాన నాబుద్ధి
ఎద్దాని చే శ్రేయమెనయునో నాకు
వివరించు మొకదాని వేగంబు గాను. 2
అనిపల్క శ్రీకృష్ణుడనె నర్జునునకు
అనఘచారిత్రుడా! అర్జునా వినము
సాంఖ్యులకై మున్ను జ్ఞానయోగంబు,
యోగులకై కర్మ యోగంబు చెప్ప
బడియుండె నాచేత, బాగుగా వినుము. 3
ఎవ్వాడు కర్మల నిలమానుకొనునొ
అవ్వాడు నిష్క్రియంబగు నాత్మరూప
మందంగ గల్గుట యనునది కల్ల
కర్మవీడిన మాత్ర కలుగంగబోవ
దెవ్వానికిని మోక్ష మేనాటికేని. 4
కర్మలొ నర్పక క్షణమైన గూడ
ఊరకుండగబోవదుర్విలో నెవడు
ప్రకృతిగుణాలచే ప్రతివాడు కర్మ
లాచరింపక యుండ నగునె సాధ్యంబు. 5
ఎవడు జ్ఞానము కర్మయింద్రియంబులను
అణచియు మదిని శబ్దాది విషయము
లను చింతచేయునో రహి నట్టి మూఢ
చిత్తుండు కపటిగా చెప్పంగబడును. 6

అర్జునా! యెవడింద్రియంబులన్నిటిని
మనసుచే నియమించి మరివానిచేత
కర్మయోగమును సంగములేనివాడై
ఆచరించునొ యాతడొ నుత్తముండు. 7
నీవు శాస్త్రములచే నియమింపబడిన
కర్మలం జేయుము, కర్మలన్ విడుట
కంటె చేయుటమేలు, గమనింపనింక
కర్మమానితివేని గడువదు బ్రతుకు. 8
యజ్ఞము కొరకైన ఆ కర్మకంటె
తక్కినకర్మలే తనకు బంధములు
కాన యజ్ఞపు కర్మ కామంబు వీడి
యొనరింపు చక్కగా నోపాండవేయ. 9
బ్రహ్మ యజ్ఞంబుచే ప్రజల పుట్టించి
వారితో మునుదెల్పె వరుసగా నిట్లు
యజ్ఞాలచే మీర లభివృద్ధి గనుడు
అవియె మీ కోర్కెల నన్నిటిన్ తీర్చు. 10
మీరలా యజ్ఞాల మేకొని చేసి
దేవతలకును సంతృప్తి గల్గింపు
దాదేవతల్గూడ నట్టులే మీకు
తృప్తినిచేకూర్చు తెలియంగ నిటుల
ఒండొరులకు తృప్తియొనరించుకొన్న
ఉత్తమమగు శ్రేయ మొందంగ గలరు. 11
యజ్ఞాలచేతృప్తులైన దేవతలు
కరుణతో నొసగు భోగ్యంబులన్నిటిని
వారికర్పింపక వరుసతో తినెడి
వాడె చోరుండని వచియించుచుంద్రు. 12
యజ్ఞాల మిగిలెడి నట్టి పదార్థ
మనుభవించెడి వారలఖిల పాపముల
బాయుచునుందురు బాగుమీరంగ
అటుగాక తనకు తా నారగించినను
పాపంబునే తినువాడగున్ వాడు. 13
అన్నంబు చే కల్గు నఖిలప్రాణులును
అన్నంబు వృష్టిచే నావిర్భ వించు
యజ్ఞంబు చేతనే అవృష్టి కలుగు

కర్మచే యజ్ఞంబు గలుగుచునుండు
వేదంబుచే ప్రభవించు కర్మంబు
అక్షర బ్రహ్మచే అట్టి వేదంబు
కలుగుచున్నది గాన కౌంతేయ సర్వ
వ్యాపకుండగు బ్రహ్మ యజ్ఞంబునందె
నిలచియుండె నటంచు నీ వెరుగుమిక. 14-15
పార్థ యీరీతి ప్రవర్తించు చున్న
ధర్మచక్రమెవడు తప్పునోవాడు
తెలియ పాపియును నింద్రియలోలుడౌచు
వ్యర్థజీవనుడగు వాడు తప్పకను. 16
ఆత్మయందానందమందు చెవ్వాడు
ఆత్మయందే తృప్తి నందుచున్నాడొ
అట్టివానికి సుంతయైన చేయదగు
కార్యమొక్కందును కానంగరాదు. 17
కర్మచేయుటచేత కలుగు లాభమును
చేయకుండిన వచ్చు చెట్టయున్ లేదు
మరియు నాతనికి సమస్త జీవులను
ఆశ్రయింప దగినదసలేమి లేదు. 18
కావున నీవు సంగమును త్యజించి
చేయదగినకర్మ చేయుమెల్లపుడు
సక్తివీడియు కర్మసల్పెడు వాడు
మోక్షంబు నొందును మోదంబెలర్ప. 19
జనకాదులును మునుసల్పి నిష్కామ
కర్మంబు చేతనే కనిరి మోక్షమును
ప్రజల సన్మార్గాన వర్తింపజేయు
తలపుతోనైనను తగుదువు నీవు
కర్మలంజేయంగ గాండీవి యింక. 20
శ్రేష్ఠుడె ద్దానిని చేయునో భువిని
తక్కినవారల ద్దానిచేయుదురు
ఆతండు శ్రేష్ఠమంచని దేనిగొనునొ
తక్కిన వారలద్దానినే గొంద్రు. 21
అర్జునా! నాకు చేయదగిన కార్య
మీ మూడు లోకాల నెద్దియున్ లేదు
పొందబడనిదియు పొందంగదగిన

వస్తువేదియు నాకు వసుధలో లేదు
అయినను నేకర్మ లాచరించెదను. 22
అదియేల యంచునన్నడిగెద వేని
నేనె కర్మంబుల నెరవేర్పకున్న
జనులందరును గూడ సర్వవిధముల
అస్మదీయపు మార్గమనుసరించెదరు. 23
మరియు నే కర్మల మానినయెడల
ఈ ప్రజలెల్ల తామిట్టె చెడుదురు
అత్తరి సంఘంబునందేరు పడెడి
కలగల్పులకు నేనె కారణంబగుదు. 24
అజ్ఞానులగు వారలందరున్ కర్మ
లందున మిగుల ఫలాసక్తి గలిగి
సల్పెడి రీతినే జ్ఞానులుం గూడ
ఆసక్తి లేకుండ నన్నికార్యముల
లోకుల కొరకు సలుపగ వలయును. 25
జ్ఞాను లెన్నడు గూడ జ్ఞానహీనులకు
బుద్ధిభేదమొనర్ప బూనంగ రాదు
కామ రహితమైన కర్మంబు చేత
తన మార్గమునకును తగును త్రిప్పంగ. 26
ప్రకృతిభవములౌచుబరగు గుణాలె
సకల కార్యంబుల సలుపుచుండంగ
నేనె చేసితినని నెమ్మదిన్ దలచు
అజ్ఞుడైన మనుజు దహముతోదుతను. 27
గుణముల కర్మల గుర్తెరింగియును
గుణములు గుణముల గూడి మెలగుచు
నుండెనంచును చూచుచుందును యోగి. 28
కర్మలందాసక్తి గాంచంగబోక
ప్రకృతిచె మోహింప బడియును దేహ
కర్మలందునరక్తి గలిగి యున్నట్టి
అల్పమతుల జ్ఞాని యైనట్టి వాడు
చలనమొందగజేయ జనదు గాండీవి. 29
అన్నికర్మంబుల నధ్యాత్మబుద్ధి
అర్పించి నాయందహంబును వీడి
ఆశయు మమకారమనునవి లేక

సమర మొనర్పగా చయ్యన లేచి
విల్లుచేకొనవోయి వీరావతంస. 30
అవనిలో నేజనులనసూయ గలిగి
శ్రద్ధాన్వితులునయి సర్వకార్యముల
నాయభిప్రాయాల నయముతోడుతను
ఆచరించెదరొ వారందరు కర్మ
బంధాల జిక్కక భద్రమందెదరు. 31
అర్జునా! నాయీ యధ్యాత్మ మార్గమును
గమనింప నిష్కామకర్మమార్గంబు
అనుసరింపరొ ద్వేషమాత్మలంబొంది
అట్టి వారింగూర్చి అజ్ఞానులనియు
చెడినవారంచునే చెప్పుచున్నాడ. 32
ఎంత జ్ఞానంబున్న నేమి? తానరుడు
తనదుప్రకృతికిని తగినట్లుగానె
వర్తించుచున్నాడు పార్థ వీక్షింప
కాన నిగ్రహమేమి గావింపగలదు. 33
ప్రతియింద్రియముకు శబ్దాదులయందు
ద్వేషరాగంబులు తిలకింప గలవు
ఆ రాగ ద్వేషాల కనుకూలముగను
చరియింపగారాదు, శత్రువుల్ గావె
మనిషికి నయ్యవి మఘవతనూజ. 34
తగనొనర్చెడి పరధర్మంబు కంటె
తన ధర్మమే మేలు తక్కువ దైన
తన ధర్మమున మృతి తనకుశ్రేయంబె
పరధర్మమయ్యది భయదమైయుండు
ఆచరణమునకు ననుచితంబగును. 35
అపుడు శ్రీకృష్ణుతో నర్జునుం డట్టు
లైనచో మనిషితా నఘములొనర్ప
కోరిక లేకుండి గూడనెద్దాని
ప్రేరణతోడుత వేగకిల్బిషము
బలవంతముగ జేయు, బాగుగా దెల్పు
మన, కృష్ణుడపుడు తాననె పార్థుతోడ. 36
వినవయ్య తెల్పెద! వీరాగ్ర గణ్య!
రాజసగుణమందు రహిబుట్టినట్టి

కామమే క్రోధమై కదువృద్ధిజెందె
ఆ కామ మెంతెంతయనుభవించినను
కాసింత తృప్తిని కనబోనిదియును
పాపాలకెల్ల నుపాధియైనదియు
నైయుండె గావున నది మోక్షమునకు
పరమ శత్రువటంచు భావింపుమీవు. 37
పొగచేత నగ్నియు మురికిచే నద్ద
మును, మావిచే గర్భముననున్న శిశువు
కప్పంగ బడురీతి కామంబు చేత
ఆవరింప బడియె నాత్మజ్ఞానంబు. 38
అర్జునా! నిండింప నలవి గానిదియు
అగ్నివోలెను తృప్తి నందబో నిదియు
ఆశయే రూపుగా నలరుచున్నదియు
జ్ఞానికి సర్వదా శత్రువైనదియు
నగు కామమున నాత్మ ఆవరించంగ
బడియున్నదంచును వచియింతు నేను. 39
ఈ కామ మనుదాని కింద్రియాల్ మనసు
బుద్ధియు నాశ్రయములగుచునుండె
ఆ యింద్రియాలచే నాత్మ జ్ఞానమును
కప్పి యా కామంబు కడకు తానరుని
ఘన మోహమునముంచు కడిమి మీరంగ. 40
భరతకుల శ్రేష్ఠ! పార్థుడా! నీవు
కడకతో నింద్రియగ్రామంబు దోలి
జ్ఞాన విజ్ఞానాల సమయించుచున్న
పాప స్వరూపమై ప్రబలినయట్టి
కామమున్ పూర్తిగా కసిమసగు మిక. 41
ఈ దేహమును మరియింద్రియంబులును
మనమును బుద్ధి క్రమంబుగ గొప్ప
ఒకదానికంటె మరొక్కటనదగు
కడకు బుద్ధిని మించగలవాడెవండొ
ఆతడేయగునాత్మయనుచునుండెదరు. 42
గొప్ప బాహులున్న కుంతీ తనూజ
ఇట్లు బుద్ధికిగూడనెంచ నతీత
మైయున్న నయ్యాత్మ నారసి లెస్స

మనసును బుద్ధిచే మాన్పింప జేసి
జయమందుటకు కష్టసాధ్యమైయున్న
కామమన్ శత్రువున్ ఖండింపుమింక. 43
ఉపనిషత్సారంబు యోగశాస్త్రంబు
నగు భగవద్గీతలందు పార్థునకు
శ్రీకృష్ణపరమాత్మచే చెప్పబడిన
కర్మయో గంబిది, గమనింప గాను
మంజరీ ద్విదపగామహిని వెల్గొందు.

4

# శ్రీ భగవద్గీత

## 4వ అధ్యాయము

## జ్ఞాన యోగము

అర్జునా! మున్నునే నర్యమునకును
ఈ కర్మయోగంబు నెఱిగించినాడ
అతడు వైవస్వతు కర్థి బోధించె
ఆతడిక్ష్వాకున కాపైన జెప్పె. 1
క్రమముగా నిట్లు నిష్కామంపు కర్మ
నెరిగి నారలు మునుపెల్ల రాజర్షు
లెంతయో కాలంబదేగిన కతన
అణగారియును పోయె నాయోగ మిపుడు. 2
భక్తుండవును నాకు పరమమిత్రుండ
వీవు గావున జెప్పితిపుడు నద్దాని
అది శ్రేష్ఠమును రహస్యంబైన దంచు
గమనింపు పార్థనిక్కముగ నీ మదిని. 3
ఇప్పటిదౌ చూడ యానీదు జన్మ
బహుపురాతనము ప్రభాకరు జన్మ
అట్టిచో నీవెట్టు లాసూర్యునకును
బోధించి నావని బుద్ధి నెంచెదను. 4
అన పార్థునకు కృష్ణుదనియెనిప్పగిది
పరవీర భీకరా! పర్జన్యతనయ!
జరిగిపోయెను మున్ను జన్మాల వెన్నొ
నాకు నీకును గూడ నయము మీరగను
వాని నన్నిటి నేను వరుసగా నెరిగి
యుంటిని గాని నీవుంటి వెరుగక. 5
చావుపుట్టువులేని సత్యరూపుడను
ఎల్ల ప్రాణులకు నే నీశ్వరుండయ్యు
ప్రకృతిని స్వయముగా వశపరచుకొని
అవతరించెదను మాయాశక్తిచేత. 6

ఎప్పుడెప్పుడు ధర్మమెల్ల నశించి
అభివృద్ధి యెపుడెపుడగునో యధర్మ
మపుడపుడే ధాత్రియందునన్ నేనె
సృష్టించు కొందును చెల్వుగా తనువు. 7
సాధురక్షణము నసాధు శిక్షణయు
కావించి ధర్మంబు కాపాడు కొరకు
ప్రతి యుగంబున నేను ప్రభవించుచుందు
తప్పకుండగ పార్థ ధాత్రియందు నను. 8
యెవ్వడీరీతిగా నెరుగునో నాదు
జన్మ కర్మంబుల సత్యంబు గాను
ఆతండు మరణంబు నందిన పిదప
పుట్టబోవక నన్నె పొందుచున్నాడు. 9
అనురాగ భయ కోప మనునవి లేక
చిత్తంబు నాయందె చేరిచి మిగుల
జ్ఞాన తపస్సుచే కలుషాలు పోవ
నా స్వరూపముపొంది నారనేకులును. 10
ఎవ్వరే రీతి నన్నెంచి పూజింత్రొ
వారికా రీతినే ఫలముల నిడుదు
అనుసరింతురు జనులందరు నాదు
మార్గంబు తప్పక మఘవతనూజ. 11
కర్మఫలితముల కాంక్షించు వార
లారాధనముచేయు నా దేవతలను
కర్మఫలములును కడు శీఘ్రముగనె
కలుగుచున్నవి గాన కాంచంగ భువిని. 12
నాలుగు వర్ణాలు నాచేత తొలుత
కావింపబడె గుణకర్మల వలన
కర్తనైనను గాని కనగ వాని కిని
నన్న కర్తగ, నవినాశిగ నీదు
భావమందెంచుము బాగుమీరంగ. 13
అర్జునా నను కర్మ లంట వటంచు
కర్మఫలము నేను కాక్షింప నంచు
ఎవ్వడు ననుగూర్చి యెరుగునో వాడు
కర్మబంధ విముక్తి గాంచంగ గలడు. 14

పూర్వ ముముక్షువుల్ పూర్తిగా నెరిగి
నిష్కామ కర్మంబు నెరపియున్నారు
కావున నీవు నిష్కామ కర్మంబు
పూర్వీకు లట్టులే పొనరింపుమికను. 15
ఎట్టిది కర్మంబదెట్టి దకర్మ
మనియెడు విషయంబునందు పండితులె
సక్రమంబుగ తెల్పజాల రద్దాని
సంసార బంధంబు సడలింపజేయు
ఆ కర్మ యోగ రహస్యంబు నిపుడు
తేట తెల్లంబుగా తెల్పెదన్ వినుము. 16
కర్మ మకర్మ వికర్మంబులనెడి
వానిని తెలియంగ వలె బాగుగాను
ఏలయంచదుగుదు వేనిగాండీవి
అద్దాని వాస్తవంబతిలోతు గాన. 17
కర్మలం దెవ్వాదకర్మంబు నిక న
కర్మంబు నందున కర్మంబుగనునొ
వివరింప వాడు వివేకవంతుడును
యోగయుక్తుండును, ఉర్విలో సకల
కర్మలొనర్చిన ఘనుడౌచు నుండు. 18
ఆశయు సంకల్ప మనునవి లేక
నీరగున్ జ్ఞానమన్ నిప్పుచే నెవని
కర్మ లవ్వానిని గమనింప గొప్ప
పండితుండంచును పల్కంగదగును. 19
ఫలమునందాసక్తి వదలి యెవ్వాడు
సతతంబు మదిలోన సంతృప్తి గలిగి
కర్మలంజేసిన గాని యెద్దాని
నాచరింపనివాడెయగును నిక్కముగ. 20
వాంఛ యింద్రియములవర్గంబు మనసు
వశమునందు గలట్టివాడుతాతనువు
చేతచేసెడి కర్మచేత నెప్పుడును
పాపలేశము గూడ బడయంగబోదు. 21
అప్రయత్నాన లభ్యంబగు దాని
అనుభవించుచు తృప్తినందెడు వాని

సుఖదుఃఖ ద్వంద్వముల్ సురిగినవాని
మాత్సర్య మొకయింత మదిలేని వాని
కర్మబంధింపదు గాండీవి! ఎపుడు. 22
ఎద్దానిపై ప్రీతి నెనయని వాడు
కామాది శత్రులన్ గాల్చిన వాడు
ఆత్మయందే మది సరికట్టువాడు
పరహితార్థము కర్మబరపెడు వాడు
జన్మబంధములొంద జాలడాతండు. 23
యజ్ఞసాధనములు యజ్ఞ ద్రవ్యములు
యజ్ఞకర్తయు నగ్ని యజ్ఞఫలమును
బ్రహ్మమంచును మదిభావించి యజ్ఞ
మాచరించెడి వాడె ఆ బ్రహ్మజేరు. 24
కావింత్రు కొందరు కర్మయోగమును
దైవమున్ దలచుచు తగినట్టి రీతి
బ్రహ్మయజ్ఞంబున భస్మం బొనర్త్రు
కొందరు జీవుని కోర్కె మీరంగ. 25
ఇక కొందరిలను కర్మేంద్రియంబులను
నిగ్రహాగ్నికి కదు నియతి నర్పింత్రు
ఇంద్రియాగ్నులలోన నిదుచుంద్రుకొంద
రధికమౌ శ్రద్ధతో నవని లోపలను
శబ్దాది విషయాల సక్రమంబుగను. 26
ప్రాణేంద్రియాల వ్యాపారంబు లన్ని
జ్ఞానంబుచే ప్రకాశము నొందుచున్న
అగ్నిలో హోమము నాచరించెదరు
కొందరు చూడంగ కుంతీకుమార! 27
ద్రవ్యయజ్ఞంబును తాల్మికొందరును
యోగయజ్ఞంబున నుండికొందరును
తపమె యజ్ఞంబుగా దలచికొందరును
సలుపుచుందురుయతుల్ సకలయజ్ఞముల. 28
ప్రాణ వాయువున నపాన వాయువు న
పానవాయువునందు ప్రాణవాయువును
చేర్చియు హోమంబు చేయుచుండెదరు
మౌనులు కొందరు మరియింక వినుము. 29

ప్రాణ వాయువులందు ప్రాణవాయువుల
నియమించి కొందరు నేర్పుమీరంగ
గావింత్రు హోమంబు గాంచంగ పార్థ!
యజ్ఞాలవలన వీరందరున్ విగత
కల్మషులగుదురు ఖండితంబుగను. 30
అర్జునా! యజ్ఞంబు నందునన్ మిగులు
అమృతరూపంబగు నన్నంబుతినెడు
నతడు శాశ్వతపు బ్రహ్మను పొందగలడు
అట్టి యజ్ఞంబొకటైనను చేయ
కున్నచో నిహపరా లుండగబోవు. 31
ఈగతి యజ్ఞంబు లెన్నియో శృతుల
వివరింపబడియుండె విశదంబుగాను
వాని నన్నిటి కర్మ భవములటంచు
ఎఱిగితేనియుముక్తి కేగంగ గలవు. 32
ద్రవ్యయజ్ఞము కంటె తలపంగ జ్ఞాన
యజ్ఞంబె శ్రేష్ఠమై యలరారు చుండు
ఎట్లనన్ కర్మంబులెన్నైన గాని
అవినాశియగు దైవ మందేవసించు. 33
అర్జునా! నీవింక నట్టి జ్ఞానమును
తత్వవేత్తలజేరి తగినట్టి రీతి
సాష్టాంగ దండముల్ సల్పియామీద
సమయంబు గమనించి సవినయ మునను
సేవలొనర్చి ప్రశ్నించితి వేని
వారుబోధింతురు వాస్తవం బెల్ల. 34
దేని తెలియ నీవు తిరిగిమోహంబు
పొందవో, దేనిచే భూతాల నెల్ల
అరయంగ గలవొ నీయందు నాయందు
అట్టి సుజ్ఞానంబు నాత్మజ్ఞులైన
పెద్దలకడపొంద వీలగు నీకు. 35
పాపులందరికంటె బహుపాపివీవె
యైనను నొక వేళ అట్టి పాపముల
కడలి లోపలనుండి గట్టెక్క గలవు.
జ్ఞానమన్తెప్పచే చక్కగా నీవు! 36

ప్రజ్వలించెడియగ్ని పాయకే రీతి
కట్టెలన్ దహియింప గల్గునో యట్లె
జ్ఞానాగ్ని భస్మంబు సలుపంగ గలదు
నిఖిల కర్మంబుల నిముషంబులోనె 37
సకల ప్రపంచాన జ్ఞానంబు కుద్ధి
వచ్చునట్టిదియెద్ది వచియింపలేదు
అట్టి జ్ఞానము, యోగ మమరినవాడు
కాలాన తనయందె గాంచుచు నుండు. 38
శ్రద్ధగల్గినవాడు సకలేంద్రియాల
రూపు మాపినవాడు, రూఢిగా నిష్ఠ
కలిగిన వాడును కదు, శీఘ్రముగనె
జ్ఞానంబు వడసియు శాంతితో వెలుగు. 39
సంశయాత్ముందును, శ్రద్ధారహితుడు
అజ్ఞానియును నాశ మందుచుండెదరు
సంశయాత్మునకును సౌఖ్యంబు లేదు
ఇహ పరంబులలోన నించుకంతయును. 40
కామరహితముగా కర్మలొ నర్చి
ఫలితమున్ ఈశ్వరార్పణముగాజేసి
జ్ఞానాన దీరిన సంశయాల్ గలుగు
ఆత్మనిష్ఠుని కర్మ లంటంగ బోవు. 41
కాన నీ మదిలోన కాపురం బున్న
సంశయభూతమున్ జ్ఞానఖడ్గమున
ఖండించిశీఘ్రమే గాండీవి లెమ్ము
నిష్కామకర్మంబు నెరపగా నీవు. 42
ఉపనిషత్సారంబు, యోగశాస్త్రంబు
నగు భగవద్గీత లందు పార్థునకు
శ్రీకృష్ణ పరమాత్మచే చెప్పబడిన
జ్ఞానయోగం బిద్ది. సత్క్రమంబుగను
మంజరీ ద్విపదగా మహినివెల్గొందు.

(5)

# శ్రీ భగవద్గీత

## 5వ అధ్యాయము
## కర్మ సన్యాస యోగము

మొదట కర్మత్యాగమున్ జెప్పి మరల
నొగి వచింతువు కర్మయోగంబునిపుడు
ఈరెంటి లోపల నెది శ్రేష్ఠమగునొ
అద్దాని నొకదాని నానతి నిడుము
అనియెడి పార్థునకనెకృష్ణుడిట్లు. 1
అర్జునా కర్మసన్యాసంబు మరియు
కర్మయోగంబును గల్గించు ముక్తి
కాని, యారెంటిలో కర్మయోగంబె
కర్మసన్యాసంబు కంటె శ్రేష్ఠంబు. 2
ఎవడు ద్వేషింపడో యెద్దానిగూడ
కాంక్షింపడో యిద్ది కావలె నంచు
అట్టిడే సన్యాసి యనుకొనవలయు
ద్వంద్వముల్ లేనట్టివాడు సులువుగ
సంసార బంధంబు సాధింపగలడు. 3
కర్మసన్యాసంబు కర్మయోగంబు
వేరువేరని యవివేకుల్వచింత్రు
కాని, యారెంటిలో గట్టిగా నెద్ది
ఆచరించిన మోక్షమగుచుండు ఫలము. 4
జ్ఞానయోగులు పొందు స్థానంబదేదొ
కర్మయోగులుపొందగల్గుదురదియె
ఈ రెండు యోగాల నెవ్వాడొకటిగ
చూచునో యవ్వాడె చూచుపో నిజము. 5
కర్మయోగముచక్కగదుపకుండగను
జ్ఞానయోగము పొంద సాధ్యంబుగాదు
కర్మంబు మననంబు గల్గు ఘనుండె
బ్రహ్మంబు పొందును బాగుగానెపుదు. 6

పరిశుద్ధ హృదయుడై వరలెడివాడు
కర్మయోగంబును గడపెడివాడు
ఇంద్రియంబులను జయించిన వాడు
మనసును స్థిరముగా మలచిన వాడు
తనయాత్మ సర్వాన తనరునంచెరుగు
వాడు కర్మంబుల వరుసచేసినను
అవ్వానిచేత తా నంటంగ బడడు. 7
పరమార్ధతత్వంబు వడసిన యోగి
నడయాడినం గాని, నయనద్వయంబు
తెరచి చూచినగాని, తినుచున్నగాని
విషయాలయందున నింద్రియాలెల్ల
చరియించు చున్నట్లు చక్కగా నెరిగి
నేనొక్కటైనను నెరపలేదంచు
నిశ్చయించుకొనును నెమ్మనంబునను. 8-9.
ఎవడు తా కర్మంబు లెల్లనుంగూడ
పరమాత్మ కర్పించి బడయకాసక్తి
చేయుచుండునొ, నీటిచే తామరాకు
అంటకుండినయట్టు లాతనిన్ పాప
మంటంగ బోదెప్పుడర్జునాకనగ. 10
ఫలమునందాసక్తివదలియున్ బుద్ధి
చేతను, దేహంబుచేత మనస్సు
చేత కర్మంబుల చేయుచుండెదరు
చిత్తశుద్ధి కొరకు చెలగియోగులును. 11
కర్మఫలము వీడ గలిగిన యోగి
ఆత్మశాంతిని సదా అనుభవించెడిని
ఫలితమాశించెడివాడు తానెపుడు
భవబంధములతోడ బాధలంబొందు. 12
మనసుచే సర్వకర్మములను మాని
తొమ్మిదిద్వారాల తోడి పురమను
దేహంబునందు నింద్రియనిగ్రహంబు
గల దేహధారి తాగాంచు సౌఖ్యంబు. 13
కర్తృత్వముంగాని కర్మలన్ గాని
కలిగింపలేదు నిక్కము పరమాత్మ
ప్రకృతియె వానిని ప్రభవింప జేయు. 14

పరమాత్మయెవ్వాని పాప పుణ్యముల
గ్రహియింప బోవదు, కామంబు చేత
కప్పంగబడియుండె గాన జ్ఞానంబు
జీవుండు భ్రమలందు చిక్కుచున్నాడు. 15
ఎవ్వాని యజ్ఞానమెపుడు జ్ఞానమున
అంతంబునందునో అతని జ్ఞానంబు
ఖరకరు రీతి ప్రకాశించి బ్రహ్మ
రూపంబుజూపించు రూఢిగా క్రీడి. 16
బుద్ధిమనస్సును పూర్తిగా నిష్ఠ
కలిగిన వారలై గతితానె యంచు
అప్పరమాత్మనే ధ్యానమందుంచు
వారలు పోయినపాపాలు గలుగు
వారలై మోక్షంబు వడయుచున్నారు. 17
విద్యావినయమున్న విప్రునియందు
గోవునందున నేనుగునయందు నింక
కుక్కయందునను నా కుక్క మాంసమును
వండుకొనితినెడు వానియందు నను
సమదృష్టి గల వారె జ్ఞానులంచంద్రు. 18
మహి నేరి మనసు సమత్వంబుగలదొ
అట్టివా రీజన్మ మందునే పార్థ
జననమరణరూప సంసరణమును
దాటిన వారంచు తలపంగ వలెను
అది యెట్టులందువా అబ్రహ్మదోష
మలినరాహిత్య సమత్వంబు గలది
అందుచే బ్రహ్మమునందె తాముంద్రు. 19
స్థిరమగు చిత్తంబుచే నుండువాడు
మోహంబు సుంతేని మొనయని వాడు
బ్రహ్మలో నిలకడ బడసిన వాడు
ప్రియ మప్రియము సంభవించిన గాని
తోషదుఃఖాలకు తొణకక నిలుచు. 20
బాహ్యాన గల్గు శబ్దాదుల యందు
అసక్తిజూపని యట్టి యాఘనుడు
బ్రహ్మనిష్ఠ సమాధి వసియించువాడై
పరిధిలేని సుఖము వడయుచున్నాడు. 21

విషయ సంయోగాన వెలయు భోగాలు
అతి దుఃఖహేతువులల్పకాలికము
లైయుండె, విజ్ఞానులగువారువాని
యందున క్రీడింప నరుగకుండెదరు. 22
ఈతనువెవ్వదు విడుటకు ముందె
కామకోపాల వేగము నాపగలడొ
అతడే యీలోకమందు యోగియును.
సుఖవంతుడును నగు చూడ నర్జునుడ. 23
ఎవ్వాడు ఆత్మయందే సుఖించుచును
ఆత్మప్రకాశాన అలరారగలడొ
రూఢిగా బ్రహ్మస్వరూపుడై వాడు
బ్రహ్మకైవల్యంబు పడయుతప్పకను. 24
పాపలేశంబైన బడయని వారు
నిస్సంశ యాత్ములై నెగడెడివారు
ఇంద్రియ మనముల నింకించు వారు
ప్రాణులన్నిటి మేలు వాచించువారు
నగుపురుషులు ముక్తినందుచుండెదరు 25
కామాదులంజంప గలిగిన వారు
నిగ్రహంబుగ మదినిల్పెడివారు
ఆత్మతత్వము నెర్గి నట్టివారలును
బ్రహ్మము నంతటన్ పరికించుచుంద్రు. 26
చక్కగా వెలినున్న శబ్దస్పర్శాది
విషయాల నెల్లను వెలికి పోనెట్టి
భ్రూమధ్యమున దృష్టిపోలుపుగా నిలిపి
నాసికా పుటముల నయమొప్పదిరుగు
ప్రాణ వాయువుల నపాన వాయువుల
సమముగా సవరించి సకలేంద్రియాల
మనమును బుద్ధిని మరి నిగ్రహించి
కోపమున్ భయమును కోరికన్విడచి
మోక్షమందాసక్తి పూర్తిగాగలుగు
మననశీలుండగు మహనీయుడెపుడు
ముక్తుదేయగునుచూ, భూరిప్రతాప! 27-28
యజ్ఞతపంబులయందున్న యట్టి

ఫలమారగించెడి వాడనటంచు
భువనాలకెల్ల ప్రభుండనటంచు
ప్రతి జీవికిని మేలు వలతు నటంచు
ననుగూర్చి తెలిసిన నరుడెల్లపుడును
పరమశాంతిని వాడు బడయుచున్నాడు. 29
ఉపనిషత్సారంబు, యోగశాస్త్రంబు
నగుభగవద్గీత లందు పార్థునకు
శ్రీకృష్ణపరమాత్మ చే చెప్పబడిన
కర్మసన్యాసయోగంబను యిద్ది
మంజరీ ద్విపదయై మహిని వెల్గొందు.



# 6

# శ్రీ భగవద్గీత

## 6వ అధ్యాయము

## ఆత్మ సంయమ యోగము

ఫలితమందున కోర్కెవదలియెవ్వాడు
చేయదగిన కర్మచేయునో వాడె
యగును సన్యాసియు నగునుతాయోగి
అంతియేగాని తా నగ్నిహోత్రమును
కర్మలన్ విడచిన కాజాలడెపుడు
సన్యాసియును, యోగి సక్రమంబుగను. 1
అర్జునా! సన్యాస మనిదేని నంద్రొ
అద్దానినే యోగమని నీవెరుగుము
సంకల్పమును వీడజాలనివాడు
యోగియై వెలయంగ యోగ్యుండుకాదు. 2
ధ్యానయోగము చేయదలచెడిమునికి
కర్మ సాధనచేయగా వలె నంచు
అద్దాని సాధించి నట్టి వానికిని
ఉపరతింజెప్పిరి ఉచితంబటంచు. 3
వినుపార్థ! శబ్దాది విషయాలయందు
కర్మలందున సక్తి గాంచంగబోడొ
సంకల్ప త్యాగంబు సల్పంగ గలడొ
అపుడె యోగారూఢు డనదగు నరుని. 4
తన్నుద్ధరించుకోతగు గాని తానె
త్రోసి కో రాదుయధోగతి కె పుడు
ఎట్లన తనకుతానే బంధువగును. 5
తనమది నెవ్వడు తాగెల్వగలడొ
అయ్యదే బంధువైయలరారుచుండు
తనమది నెవ్వడు తాగెల్వలేడొ
అయ్యదే శత్రువై అభివృద్ధి గాంచు. 6

చలివేడియును దుఃఖసౌఖ్యాలు గౌర
వాగౌరవములు తన్నలమిన గాని
ఆత్మాను భవమురవంతైన చెడదు
మదిని గెల్చినయట్టి మానవునకును. 7
శాస్త్రాను భవమైన జ్ఞానంబుతోడ
తృప్తిగాంచిన నెమ్మదిన్ గల్గునతని
ఎట్టి వికారము లెరుగని యతని
మట్టి బంగారొక్కమాదిరింగనిన
యతని, యోగారూఢుడనదగు పార్థ!. 8
నిస్వార్థ ముగమేలు నెరపు వారలను
స్వార్థంబుతో మేలు సల్పువారలను
పరమ శత్రువులను బంధుజనముల
పాపాత్ములను సమభావాన జూచు
నాతడే కడుశ్రేష్ఠుడని పల్కదగును. 9
ఏకాంతదేశాన కేగి కూర్చుండి
దేహేంద్రియాల స్వాధీనాన నుంచి
పరులచే నెయ్యది బడయంగబోక
మదిని తానాత్మలో మరిగింపవలయు. 10
పరిశుద్ధమైనట్టి పాత్రంబు నందు
పొడవుగాక మిగులపొట్టియుంగాని
దర్భాసనము చేర్చి దానిపై తోలు
దానిపై వస్త్రంబు తగ ఘటియించి
అచలమై నట్టిదౌ ఆసనము నిడి
దానిపై గూర్చుండి తనదు మనస్సు
ఏకాగ్రముగ నుంచి, యింద్రియంబుల మ
నఃక్కార్యముల నెల్ల నయముగానిల్పి
అంతఃకరణ శుద్ధికై ధ్యానమిటుల
ఆచరింపవలయు ననవరతమును. 11-12
తనువు శిరస్సును తగకంఠ మున్ను
సమముగా నిల్పియు సదలంగ నీక
ఏ దిశ పరికింప కించు కంతయును
నాసికాగ్రమునందు నయముగా చూపు
నిలిపియు సతతంబు నిర్భయుండౌచు

బ్రహ్మచర్యవ్రత పాలన గలిగి
నన్నెగతి యటంచు నమ్మి సమాధి
నాచరింప వలయు నర్జునాయోగి. 13-14
ఈ రీతిగా మది నెల్లప్పుదాత్మ
ధ్యానాననిల్పి నాయందు నున్నదియు
పరమ సంతోషమై బరగెడు నదియు
నగు మోక్షమును యోగియందంగ గలదు. 15
తిండియధికముగా తినియెడివాడు
అసలె తిననివాడు నతి నిద్రయుతుడు
ఎపుడు గూడను నిద్రనెరుగని వాడు
ధ్యానయోగానికి తగువాడు కాడు. 16
మితభోజనంబును మితమైన నిద్ర
మితకర్మ వర్తన మితమైన నడత
మితమైన జాగృతి మేదినిం గలుగు
మనిషికి యోగంబు మాన్పుదుఃఖంబు. 17
ఎపుడు మనసు నిగ్రహింపబడియును
ఆత్మయందే స్థితినందంగలదొ
ఎపుడు యోగితలపులెల్ల వదలునొ
అపుడె యోగపుసిద్ధినందంగ గలదు. 18
గాలిలేని యపుడు కదలక దీప
మేరీతి వెల్గునో యెంచ నా రీతి
ధ్యానయోగంబును తగునట్లు చేయు
యోగీశ్వరుని మనస్సుండు నిశ్చలత. 19
ఎచట పరమశాంతియేర్పడం గలదొ
మదినిగ్రహము గల్గ మహిని యోగికిని.
ఎచట నెమ్మదిచేతనే ఆత్మగనుచు
ఆనందమును తనయందునే గాంచు
ఎచ్చోట నుండి యోగీంద్రుండు తాను
పరిధిలేని సుఖంబువడయంగ గలదొ
ఎచ్చోట నుండి తానింత కదలక
తెలియంగ దగుదాని తెలియంగ గలడొ
ఏదిపొందిన వెన్క నెద్దాని నైన
అంతకున్ మించినదనకుండ గలడొ

అట్టి దుఃఖరహిత మైనట్టి స్థితియె
అత్మయోగంబని అరయుము నీవు. 20-21-22-23
సంకల్పమున గల్గు సకల కోర్కెలను
సంపూర్తిగా దవ్వ సల్పంగవలయు
ఇంద్రియ గ్రామంబు నెటుపోవ నీక
మనసుచే గట్టిగా మాన్పంగ వలయు
ధైర్యయుక్తంబైన తన బుద్ధిచేత
పరుగిడు చిత్తమున్ పట్టంగ వలయు
అంతమీదటను తానంతరంగమున
హాయిగా విశ్రాంతి నందంగ వలయు
మరియు నాత్మగతిని మది స్థాపనమును
గావించి, యన్యమై కానంగబడెడి
వానినెల్లను గూడ భావంబునందు
స్మరణంబుచేయుట మానంగ వలయు. 24-25
అస్థిరత్వంబైనయట్టి చిత్తంబు
ఎచ్చోటి కెచ్చోటి కేగునో చూచి
అచ్చోటు మరలించి ఆత్మయందుననె
స్థాపితం బొనరింపతగు దానివిడక. 26
ఎవ్వాడు శాంతుండొ యెవ్వాడు కామ
క్రోధాలనరికట్టుకొనుశక్తియుతుడొ
ఎవ్వాడు బ్రహ్మంబు నెనసిన వాడొ
ఆయోగియే పొందు నమిత సౌఖ్యంబు. 27
ఈ ప్రకారంబుగా నెల్లప్డు మదిని
చెదరనీయక నాత్మచేర్చెడి దోష
రహితాత్ముడగు యోగి రయమున పొందు
బ్రహ్మరూపంబైన పరమసౌఖ్యంబు. 28
యోగమనస్కుడౌ యోగివర్యుండు
సకలంబు నందున సమదృష్టి గలిగి
తాసర్వ భూతాల తనరుచున్నట్లు
అన్ని జీవులు తనయందును నట్లు
వీక్షించుచుండును విశదంబుగాను. 29
నే నన్ని భూతాల నిండియున్నట్లు
అన్ని భూతాలు నాయందునున్నట్లు

కాంచు వానికి నేను కనుపించుచుందు
వాడు నాకును కనబడకుండబోడు. 30
అన్నిభూతంబుల యందున్న నన్ను
భేదమెంచకను సేవించెడి యోగి
ఏరీతి వర్తింపనేమి యాతండు
వసించు నాయందె వాస్తవముగను. 31
సర్వజీవులయందు సంభవంబందు
సుఖదుఃఖములను తాజూచినయపుడు
తనవిగా హృదయాన తలచెడి యోగి
శ్రేష్ఠతముండని చెప్పంగబడును. 32
చిత్తనిగ్రహమున సిద్ధింపదగిన
అద్దాని, స్థిరమైనయట్టి నిల్కడను
చపల మనస్సుచే చక్కగా నేను
అరయంగలేనైతి నయ్య, శ్రీకృష్ణ. 33
చంచలంబును బహు శక్తివంతంబు
దృఢతరంబౌ గదా తెలియ మనస్సు
అద్దాని నణచుట ననిలంబు ద్రాట
కట్టుట కంటెను కష్ట సాధ్యంబ
టంచు నేభావింతు నాత్మలోపలను. 34
ఆ రీతి బల్కిన యర్జును తోడ
చెప్పంగ సాగెను శ్రీకృష్ణు డిటుల
అర్జునా నీవిప్పుడాడిన యటులె
చంచలత్వము సహజంబౌను మదికి
అద్దాని నరికట్టు టధిక కష్టంబె
అందులో సందేహమావంత లేదు
అయిన నభ్యాస వైరాగ్యాలచేత
నిగ్రహింపగబడు నిశ్చయంబుగను. 35
నిగ్రహంబుగ మది నిలుపంగ లేని
వానికీ యోగంబు వర్తింప దనుచు
భావించెదన్నేను, స్వాధీనమైన
మనసుతో యత్నంబు మానక చేయు
జనులకే యియ్యది శక్యమై యుండె. 36

అన నాలకించియు నర్జునుండనియె
శ్రద్ధయు నిగ్రహ శక్తియున్ లేని
యాతండు యోగంబు నందుండి జారి
ఆత్మసాక్షాత్కార మందంగ లేక
ఏగతి కేగునో యెరిగింపు కృష్ణ. 37
బ్రహ్మామార్గాన స్థిరత్వంబు లేని
మూఢ మానవుడు తాపూర్తిగా నిహము
పరముల కుంచెడి వ్రయ్యలై చెదరు
అంబుదంబట్టుల నణగార కున్నె. 38
పూర్తిగా నామది పొదచూపియున్న
ఈ ధర్మసందేహ మీవె తీర్పంగ
తగుదువు నీకంటె ధాత్రిలోపలను
తీర్పంగ దగినట్టి ధీవరుల్ లేరు. 39
అని పృచ్ఛ చేసిన ఆలించియపుడు
కృష్ణుండు వచియించె క్రీడితోడుతను
పార్థ! యోగము నుండి భ్రష్టుడౌ వాని
కిహపర లోకాల నేహాని లేదు
మంచి కార్యము చేయుమనిషికెప్డేని
కలుగు నాదుర్గతి? గాండీవి యోగ. 40
భ్రష్టుండు మృతి జెంది భవ్య లోకాల
కేగియు నటకొన్నియేండ్లుండి పిదప
పరిశుద్ధులును ధనవంతులౌ వారి
ఇంద్లలోపల జనియించును తిరిగి. 41
అటుగాక ఉత్తమమౌ యోగియైన
జ్ఞానవంతులలోనె జన్మించుచుందు
ఈవిధంబగు జన్మ మీలోక మందు
కడు దుర్లభంబని గమనింపుమీవు. 42
అట్లు జన్మంబంది ఆపైన నతడు
పూర్వసంస్కారము పొందియు మరల
సంపూర్ణ మోక్షంపు సంసిద్ధి కొరకై
గట్టిగా యత్నంబు గావించుచుందు. 43
అతండు పూర్వప భ్యాసంపు బలిమి
అట్టి యోగానికే యరుగును మరల

అట్లేగి తెలియంగ నభిలాష గలుగ
వేదంబులందున వివరింపబడిన
కర్మఫలము వాడు గడచుచున్నాడు. 44
గట్టిగా యత్నించు ఘనుడైన యోగి
పాప రాహిత్యుడై బహుజన్మలందు
ఆచరింపబడిన యభ్యాసబలిమి
సాధించియును యోగ సంసిద్ధి పిదప
ఉత్తమోత్తమగతి నొందు చున్నాడు. 45
తాపసికంటె శాస్త్రజ్ఞుని కంటె
కర్మనిష్ఠుని కంటె కదు శ్రేష్ఠుదంద్రు
యోగిని, కావున యోగివి కమ్ము
ఇక నుండి గాండీవి యీవును గూడ. 46
మనసు నాయందున మానక నిలిపి
ధ్యానించుచుండునో అహరహములును
అట్టివాడే యోగులందరి కంటె
అత్యుత్తముండగు ననియె నా మతము. 47
ఉపనిషత్సారంబు యోగశాస్త్రంబు
నగు భగవద్గీతలందు పార్థునకు
శ్రీకృష్ణ పరమాత్మచే చెప్పబడిన
ఆత్మసంయమ యోగమనియెడి యిద్ది
మంజరీ ద్విపదయై మహిని వెల్గొందు.



7

# శ్రీ భగవద్గీత

## 7వ అధ్యాయము

## విజ్ఞాన యోగము

అర్జునా! మనసు నాయందున నిలిపి
ఆశ్రయించియు, యోగమాచరించుచును
నిస్సందియంబుగా నీవెట్లు నన్ను
తెలియుదువో దాని తెల్పదన్ వినుము. 1
దేని తెలిసికొన్న తెలిసికో దగిన
దొక్కటైనను ధరనుండంగ బోదొ
ఆ యనుభవయుతమౌ జ్ఞాన మిపుడు
బోధచేయుదు నీకు పూర్తిగా వినుము. 2
ఎన్నోవేల జనులనే యొక్కరుండొ
ముక్తికొరకు యత్నమును చేయుచుందు
అట్లుయత్నముచేయు నా ప్రజలందు
ఏ యొక్కరుడొ నన్ను నెరుగునిక్కముగ. 3
వసుధ నీరంబగ్ని వాయు వాకాశ
మహము మనసు బుద్ధియనునట్టి యష్ట
భేదంబులను పొంది విలసిల్లుచుండె
నస్మదీయపు మాయ, అనఘ చారిత్ర. 4
అర్జున, యిదిచాల అల్పప్రకృతియె
ఇంతకంటెను గొప్పదింకొక్కటుండె
ఈ జగత్తును ధరియించెదు జీవ
రూప ప్రకృతి పార్థ రూఢినెరుగుము. 5
సకలమౌ నీ చరాచర భూత జాల
ప్రభవంబు గల్గునీ ప్రకృతి ద్వయమున
ఈ రెంటి ద్వారాను యీ లోకజనన
నాశంబులకు కారణంబైతి నేను. 6
అర్జునా! నా కంటె నవని లోపలను
వేరుగా నింకెద్ది వివరింప లేదు

సూత్రాన మణులెట్లు చూడంగ గలవొ
ఆ రీతిగా లోకమంత నాయందె
కూర్పంగ బడెనంచు గుర్తుంచుకొనుము. 7
అర్జునా! నే జలమందున రుచియు
సూర్యచంద్రులయందు చూడ కాంతియును
ఘన వేదములను ఓంకారంబు గగన
మందు శబ్దంబును నవనిలో ప్రజల
పౌరుషంబైయుంటి బాగుమీరంగ. 8
కనగనే పుడమిలోగల సుగంధమును
అగ్నిలోగల తేజ మాపై సమస్త
తనువుల నుసురును, తాపసులందు
తపమునైయుంటిని తథ్యంబుగాను. 9
సకల జీవులలోన శాశ్వతంబయిన
బీజమంచెరుగుము బీభత్స నన్ను
మరియును నేబుద్ధి మంతుల బుద్ధి
తేజమ్ముగల వారి తేజమైయుంటి. 10
భరతవంశ శ్రేష్ఠ! పార్థుడా! నేను
బలవంతు లందలి బలమును మరియు
సకల జీవుల ధర్మసమ్మతంబయిన
వాంఛయౌచు మిగుల వరలుచున్నాడ. 11
త్రిగుణాలచే గల్గి తేజంబు మీరు
వస్తువులన్ని నా వలననే కలుగు.
నైనను నే వానియందున లేను
అయ్యవియన్ని నాయందునే కలవు. 12
ఈమూటి చేతనే యీ ప్రపంచంబు
అజ్ఞానమునబడె, నవ్వానికంటె
అన్యుండ నేనని, అవినాశిననియు
తెలియ జాలరయిరి తేటతెల్లముగ. 13
దైవసంబంధమై తనరెడు నదియు
గుణముల మూటిచే కూడినదియును
నగునాదు పెనుమాయ యగునె దాటంగ
నను శరణనక యే నరునకేనియును. 14

పాపులున్, మూఢులు భరతకులుండ
మాయలో చిక్కిన మానవులున్ను
అసురగుణాల్ గల్గు అధములెప్పుడును
పోడిమితో నన్ను పొందంగ లేరు. 15
అర్జునా ఆపదలందున్న వారు
భగవంతు నెరుగగా భావించువారు
అర్థంబు కాంక్షించు నట్టి వారలును
ఆత్మజ్ఞానము గల్గునట్టి వారనెడి
నాల్గురకాల పుణ్యాత్ములు నన్ను
భజియించుచున్నారు భక్తితోడుతను. 16
వారి నల్వురలోన భక్తి మీరగను
ఒక పరమాత్మతో నుండెడి జ్ఞాని
శ్రేష్ఠుడటంచును చెప్పెదన్ నేను
అట్టివానికిని నేనగుదు నిష్టుండ
ఆతండు గూడ నా కమితయిష్టుండె. 17
వారందరున్ మంచి వారలే గాని
అందులో నే జ్ఞాని ననియె నా మతము
ఏలయనంగ వాడేవేళ మనసు
స్థాపించి నను ప్రాప్య స్థానంబు గాను
నిశ్చయంబంది నన్నే గొల్చుచుండు. 18
మనుజుడనేక జన్మము లెత్తి పిదప
జ్ఞానియై బ్రహ్మమే సర్వస్వమనుచు
సద్బుద్ధి గల్గినన్ చక్కగా బొందు
చున్నాడు, లోకాన చూడంగ నట్టి
మనిషి దుర్లభుడౌను, మఘవ తనూజ. 19
ప్రకృతికి కొందరు పట్టు వడియును
కోరికల వలన కోల్పోయి బుద్ధి
దేవతాసేవకై తెలుపంగ బడిన
నియమ నిష్ఠలతోడ నిరతంబు వార
లితరదేవుల భజియించుచున్నారు. 20
ఏభక్తు డేరీతి నెంచునో పూజ
చేయంగ మదిలోన, శ్రీఘ్రంబుగానె

అట్టిరూపము మీద ననువైన శ్రద్ధ
ఆ భక్తునకును నే నమరంగ చేతు. 21
ఆశ్రద్ధతోడనే ఆతండు సతత
మారాధనము చేయు నారూపములను
నేనెయొసగునట్టి నిఖిల ఫలముల
ఆ దేవతలచేత నందుకొంచుంద్రు. 22
అల్పబుద్ధులు పొందునట్టి ఫలములు
నాశంబుతో గూడినవి యదేలనిన?
దేవతలను గొల్వ దేవతలను, న
న్నుం గొల్చువారు నన్నుంబొందు చుంద్రు. 23
సర్వోత్తమంబును శాశ్వతత్వమును
మాయకతీతమై మసలు చున్నదియు
నగునాదు రూపంబు నరయంగ లేక
అవ్యక్తముగ నుండునట్టినన్ పాంచ
భౌతిక దేహుగా భావించు చుంద్రు
అజ్ఞానులగు వారలందరు నన్ను. 24
యోగమాయను పొందియున్నట్టి నేను
కనుల కందరకును కన్పింపబోను
చావుపుట్టువు లేని శాశ్వతుండంచు
తెలివిలేని జనులు తెలియరు నన్ను 25
గాండీవి! నే మూడుకాలాల యందు
కల్గు ప్రాణులనెల్ల గాంచుచుండెదను
కానినన్నెవ్వండు కాంచంగ లేడు
ఈ విశ్వమందున నించుకంతయును. 26
సర్వజీవులు గూడ జన్మంబు తోనె
అనురాగ ద్వేషాల నావిర్భవించు
సుఖ దుఃఖములచేత చోద్యంబుగాను
అజ్ఞానమును బొందిరత్యధికముగను. 27
పుణ్యకార్యములచే పూర్తిగా పాప
సముదాయ మెవరికి సమసిపోయినదా
వారలు సుఖదుఃఖ వర్జితు లగుచు
చంచలత్వము లేక శ్రద్ధతో నన్ను
భజియించుచుండిరి భక్తి తత్పరత. 28

వార్ధక్యమున్ మృతి పారద్రోలంగ
ఆశ్రయించియును నన్నధికయత్నంబు
ఎవ్వారొ నర్తురో, యెల్ల కర్మముల
ప్రత్యగాత్మయు గూడ బ్రహ్మంబటంచు
తెలియుదు రవ్వారె తేటతెల్లముగ. 29
అది భూత, మధిదైవ, మధి యజ్ఞములను
కూడిన నన్ కనుగొనియెడి వారు
మరణ కాలమునందు మదిచలింపకను
అచల మనస్కులై అరయుదుర్ నన్ను. 30.
ఉపనిషత్సారంబు యోగ శాస్త్రంబు
నగు భగవద్గీతలందు పార్థునకు
శ్రీకృష్ణ పరమాత్మచే చెప్పబడిన
విజ్ఞాన యోగమన్ పేరున్నయిద్ది
మంజరీ ద్విపదయై మహిని వెల్గొందు.



(8)

# శ్రీ భగవద్గీత

## 8వ అధ్యాయము

## అక్షర పరబ్రహ్మ యోగము

అర్జునుండనె కృష్ణ అబ్రహ్మ మెద్ది
అధ్యాత్మయెయ్యది, అకర్మ మెద్ది
అధిభూతమని దేనిననుచునుండెదరు
అధిదైవ మెయ్యది, అధియజ్ఞుదెవడు
తెరువెద్ది వానిని తెలిసికొంటకును
నిగ్రహ చిత్తులు నిన్నెట్లె రుంగు
నంత్యకాలంబున నన కృష్ణుదనియె. 1-2
అర్జునా! అవినాశియగునుతత్ బ్రహ్మ
ఆ ప్రత్యగాత్మయే అధ్యాత్మయగును
ప్రాణుల కుత్పత్తి బదయంగ జేయు
త్యాగయుక్తమగు క్రియన్ కర్మయంద్రు. 3
అవనిలో నశియించు నట్టి పదార్థ
మునుజెప్పు చుంద్రధిభూతంబటంచు
అధి దైవమను చుందురా విరాట్ పురుష
అధియజ్ఞుదన దేహమందుండు నేనె. 4
మరణాన గూడన న్మరచిపోవకను
తలచుకొంచెవ్వదు తనువును విదునొ
అట్టిడు మద్రూప మందంగ గలదు
అనుమాన మిందులో నణువంత లేదు. 5
మరణ కాలాన నేమనిషి తానెట్టి
దేహమున్ దలచుచు దేహంబు విదునొ
స్మరణచే గల్గిన సంస్కార బలిమి
ఆ మనిషియుబొందు నట్టి రూపంబు. 6
కనుక అర్జున యెల్ల కాలంబు నీవు
తలచుకొంచును నన్ను ధర్మయుద్ధంబు

గూడ చేయుదువేని కుతుకంబుతోడ
పొందగలవు నన్ను పొచ్చెంబు లేదు. 7
అభ్యాస యోగాన నణగి యాపైన
ఇతర విషయముల కేగక నిలచు
మదిచేత నా పరమాత్మను విడక
మాటికి తలచుచు మనుజుండు వాని
నేరుగా చేరును నిక్కంబుగాను 8
పయనించు నప్పుడు భక్తితోడుతను
ప్రాణ వాయువు యోగబలముచే బొమల
నడుమ కదలకుండ నయముగా నిల్పి
ఆ పైన సర్వజ్ఞుడైన పురాణ
పూరుషుండును జగత్పూజ్యుండు అణువు
కంటె సూక్ష్ముండు లోకాల కన్నిటికి
ఆధారమగువాడు, అరయంగరాని
దేహంబు గలవాడు దేవదేవుండు
భాస్కరు కాంతికి ప్రతివచ్చువాడు
కనగ నజ్ఞానమన్ గాఢాంధకార
మునకు నవ్వల నుండు మోక్షాధిపతిని
పొందుచుండును గద పొల్పుమీరంగ. 9–10
వేదవేత్తలుగూడ వేవేల గతుల
అవినాశియని దేనిననుచు నుండెదరొ
ఎద్దానిలోనికి నేగుచున్నారొ
అనురాగ రహిత ప్రయత్నశీలురును
దేనిపై నభిలాష తేజరిలంగ
సాగింతురో బ్రహ్మచర్య వ్రతంబు
అట్టిపదము గూర్చి అతిక్లుప్త ఫణితి
పలుకదలచినాడ బాగుగా వినుము. 11
ఇంద్రియ ద్వారంబు లెవ్వండు మూసి
మనసుకు హృదయంబె మనికిగాజేసి
శిరమున ప్రాణాలుచేర్చి స్థిరముగ
ఓంకార శబ్దంబు నొప్పు మీరంగ
ఉచ్చరించుచు మేను నొగి వీడగలడొ
ఆతడుత్తమ మోక్షమందుచున్నాడు. 12–13

అర్జునా! ననునెవ్వడనవరతమును
ఏకాగ్రచిత్తుడై యెద్దియున్ గనక
ధ్యానంబు చేయునో తగు విధంబునను
అగుదునే సులభుండ నట్టి వానికిని. 14
ఉత్తమ మగుమోక్షమొందెడి వారు
నను బొంది తిరిగి యెన్నటికిని దుఃఖ
నిలయం బసత్యమై నెలకొనియున్న
జన్మంబు పొందంగ జాలకుండెదరు. 15
ఆ బ్రహ్మలోక పర్యంతంబు నైన
అన్ని లోకాలకు నరిగిన వారు
మరల జన్మల గంద్రు మహిలోన, కాని
ననుబొంద మరల జన్మంబులగనరు. 16
జరుగగాయుగములు చక్కగా వేయి
బ్రహ్మదేవున కొక్కపగలౌనటంచు
అట్టి పరిమితియే యగు రాత్రియంచు
ఎరుకగల్గినవారె యెరుగంగ గలరు
కాలతత్వంబును ఖచ్చితంబుగను. 17
బ్రహ్మదేవునకును పగలైనయంత
ప్రకృతిన సకలంబు ప్రభవంబు నొందు
రాత్రిగల్గినపుడు ప్రకృతియందు ననె
లీనమైపోవును లీలగా పార్థ! 18
ప్రకృతి కంటెను గూడ పరమైనదియును
ఉత్తమమై వెలుగొందెడిదియును
కనులతో చూడంగ కానరానిదియు
ఆదిలేకుండగ నలరారు నదియు
నైనయా పరమాత్మ యట్టులే యుండు
సర్వంబు నశించు సమయాన గూడ. 19
అరయ పూర్వపు కల్పమందుండునవియె
కర్మచేతను జన్మగాంచియున్ తిరిగి
అంతరించియటులె అవతరించెదరు
పగటి కాలమునందు వరుసగా మరల. 20
ఏ పరమాత్మతా నింద్రియంబులకు
అగుపడబోదని, అవినాశియనియు

వర్ణింపబడియెనో? వానినే బుధులు
సర్వోత్తమంబగు స్థానంబు గాను
తెలుపుచు నుండిరో, దేనిని పొంది
మరల జన్మింపరో మనుజ లోకాన
అయ్యదేమ శ్రేష్ఠమగు స్థానమగును. 21
అర్జునా యెవ్వాని యందు నీ ప్రాణి
నివహంబులుండియు నెగడుచున్నవియొ
ఈ సమస్త జగము లెవ్వాని చేత
వ్యాపింప బడినవో అట్టి పరముడు
ఏకభక్తి వలననే పొందబడును. 22
ఓ భరతశ్రేష్ఠ! ఓ పార్థ! వినుము
ఏ కాలమున యోగులేగిన యెడల
మరలతిరిగి జన్మమందంగ రారొ
ఏ కాలమున వారలేగినట్లయిన
మరలవచ్చియు జన్మమందు చున్నారొ
ఆయా విశేషాల నన్నిటిన్ వినుము. 23
అగ్ని, వెల్గును పగ లటుమీద శుక్ల
పక్షంబు తోడుత బాగుగా వెల్గు
చుండెడి ఆర్నెళ్ళ ఉత్తరాయణము
ఎపుడు కల్గగలదొ, ఎంచ నప్డేగు
బ్రహ్మవేత్తలు జనుల్ బ్రహ్మనేపొందు. 24
క్రీడి పొగయు రాత్రి కృష్ణ పక్షమును
ఆరు నెలల దక్షిణాయన మందు
కదలిపోయిన కామ్యకర్మల యోగి
చంద్రలోకానికి చయ్యన నేగి
అటకొంత వసియించి ఆపైన నతడు
మరలివచ్చియు జన్మమందు చున్నాడు. 25
ఇపుడు చెప్పబడిన యీ రెండు గతులు
శాశ్వతంబులగును జగతియందునను
మొదటిదాని వలన మోక్షంబుగలుగు
మరియు రెండవదాన మరల జన్మించు. 26
ఈ రెండు మార్గాల నెరిగిన యోగి
ఇక మోహమునుపొందదే నాటికైన

కావున నీవెల్ల కాలంబు గూడ
యోగయుక్తుడవగుమో యర్జునుండ. 27
వీనిదెలియు యోగి వేదయజ్ఞాల
తపజపాలను దానధర్మాల గలుగు
పుణ్యఫలము గోరబోవక బ్రహ్మ
స్థానంబు నా యోగి తప్పకన్ బొందు. 28
ఉపనిషత్సారంబు యోగశాస్త్రంబు
నగు భగవద్గీతలందు పార్థునకు
శ్రీకృష్ణ పరమాత్మచే చెప్పబడిన
అక్షర పరబ్రహ్మమను యోగ మిద్ది
మంజరీ ద్విపదయై మహిని వెల్గొందు.



9

# శ్రీ భగవద్గీత

## 9వ అధ్యాయము

## రాజవిద్యా రాజగుహ్య యోగము

అశుభరూపం బగునట్టి సంసార
బంధంబు నుండెట్లు బైట పడెదవొ
అతి రహస్యంబయి, అనుభవజ్ఞాన
సహితమైయున్న యీ సద్బ్రహ్మవిద్య
అనసూయ పరుడగు అర్జునా నీకు
చక్కగా బోధింతు శ్రద్ధతో వినుము. 1
ఈ బ్రహ్మజ్ఞాన మీయిలలోన గల్గు
అన్ని విద్యలకంటె నత్యుత్తమమును
అఖిల రహస్యాల నతి రహస్యమును
ధర్మయుక్తంబును, తగ నాచరింప
నధిక సులభమును అవినాశనమును
పరమ పవిత్రమై బరగుచు నుండు. 2
సవ్యసాచీ! ఆత్మ జ్ఞానంబు నందు
శ్రద్ధలేకుండిన జనులెల్ల నన్ను
కలియంగ జాలక కడమృత్యురూప
సంసారమందున జనియించుచుండ్రి. 3
కనులకు దోచు జగంబెల్ల పార్థ
అవ్యక్తరూపుండనైన నాచేత
వ్యాపింప బడియుండె, ప్రాణికోట్లెల్ల
కలవు నాయందున, కానినే వాని
యందునుండుట లేదటంచు నెరుగుము. 4
ప్రాణులు నాయందు పరికింప లేవు
నా యోగ మహిమను నయముగా జూడు
ప్రాణుల నెల్లనుత్పన్నంబు చేయు
నదియును, భరియించునట్టిదే గాని
ఆ ప్రాణులందు మదాత్మ లేదెపుడు. 5

అంతటన్ దిరుగు నాయనిలంబదెట్లు
గగనానవే స్థితి గలదియైనదియొ
ఆ రీతిగా ప్రాణులన్ని నాయందె
ఉన్నట్లుగా మది నూహించుకొనుము. 6
ప్రళయ కాలమునందు ప్రాణులన్నియును
అస్మదీయపు మాయ నణగియేయుండు
సృష్టికాలమునందు సృజియింతు నేనె
మరలనన్నిటిని సమగ్రంబుగాను. 7
ప్రకృతికివశమైన ప్రాణికోటులను
అస్వతంత్రంబైన యట్టియవ్వాని
మాయగైకొని నేను మరిమరి సృష్టి
చేయుచునుంటి విచిత్రంబుగాను. 8
ఆ ప్రకారము సృష్టి నాచరించినను
తత్కర్మలందున తగులంబుగనను
సర్వంబు నీక్షించు సాక్షిని గాన
అకర్మలెవ్వియు నంటవు నన్ను. 9
అర్జునా! అధ్యక్షుడైన నా చేత
ప్రకృతి చరాచర ప్రతతి గల్పించు
ఈ కారణముచేత నీ ప్రపంచంబు
వర్తించుచున్నది వాస్తవంబనగ. 10
ఇట్టి మత్పరతత్వ మెరుంగగ లేక
ఎల్లభూతములకు నీశ్వరుండను మ
నుష్య దేహముతోడను విలసిలునను
అపహసించుచు నుండి రజ్ఞులౌవారు. 11
వ్యర్థమౌ ఆశలు వ్యర్థ కర్మములు
వ్యర్థమౌ జ్ఞానంబు వాంఛించువారు
అసుర సంబంధ మాశ్రయించెదరు. 12
అర్జునా! వినుము మహాత్ములౌ వారు
బాగుగా దైవ స్వభావంబు గలిగి
అన్ని భూతాలకు నధికారిగాను
నాశరహితునిగా నమ్మి వేరొక్క
టెద్దియు మనసున నెంచంగ బోక
పూజచేతురు నన్ను భూరిసద్భక్తి. 13

దైవప్రకృతిగల్గి తనరెడి వారు
సర్వదా ననుగూర్చి సన్నుతించుచును
దృఢనిష్ఠులై ప్రయత్నించుచు భక్తి
తొణుకాడ వందనాల్‌తో గౌరవించి
నాయందె చిత్తంబు నయముగా నిల్పి
ఉత్తమ మగుసేవ లొనరించు చుంద్రి. 14
అద్వైతభావన నవని కొందరును
ద్వైతభావముతోడు తను కొందరున్ను
విశ్వరూపుని నన్ను వివిధ రూపాల
భజియించుచుండిరి భక్తులెల్లరును. 15
క్రతువునేనే యజ్ఞకర్తయున్ నేనె
పితృదేవతలకిదు పిండమున్ నేనె
మరియు నౌషధమేనెమంత్రంబు నేనె,
అగ్నినేనే హవిస్సునుదది నేనె
హోమంబు నేనె, బాహోన్నతా! కనగ. 16
తల్లియు తండ్రియు, తాతదాతయును
అరయదగిన వస్తు వటుమీద మిగుల
పావనంబగు ప్రణ వాక్షరంబున్ను
వేదత్రయంబును వివరింప నేనె. 17
వేడియెండనిడి తపింపనే చేతు
వర్షమొసగి ఆపు వాడను నేనె
పరమ పదము నేనె, వసుధమృత్యువును
నేనె, సత్తును నేనె, నేనె యసత్తు. 18
ప్రభువు, సాక్షియును నివాసంబు నేనె
పరమలక్ష్యంబును, భరియించువాడు
శరణ మేనె హితము సల్పెదన్ నేనె. 19
మూడు వేదాలను ముదమార చదివి
కర్మకాండను పూర్తిగా నొనరించి
అనఘులౌ వారలు యజ్ఞాల చేత
పూజించినన్ స్వర్గమునకేగు చుంద్రు. 20
అట్టివారలు స్వర్గమందు సుఖించి
తమదు పుణ్యఫలము తరిగిన తరిని
మనుజ లోకమునందు మరల పుట్టెదరు
వేద కర్మములిట్టి విధములైయుండె. 21

ఇతర భావంబుల నెవ్వారు వీడి
అనవరతమునన్నె ధ్యానించుచుంద్రొ
వారియోగ క్షేమ భారమంతయును
వహియించుచున్నాడ పార్థుండ నేను. 22
ఇలలోననింకను నిరత దేవతల
యెడ భక్తియుక్తులై ఎవ్వారు సతము
కడు నిష్ఠతో పూజగావించుచుంద్రొ
వారలందరు గూడ వరుసను దప్పి
సేవించినట్లగు చిత్రముగ నన్ను. 23
యజ్ఞభోక్తను మరి యజ్ఞప్రభుండ
నంచు నన్నెరుగని అజ్ఞులౌ వారు
అన్య దైవంబుల నారాధనంబు
సలిపి తిరిగితిర్గి జన్మించు చుంద్రు. 24
భక్తితో గొల్వ దైవాల దైవముల
పితృదేవతల గొల్వ పితృదేవతలను
భూతజాలము గొల్వ భూత జాలమును
నన్నుగొల్వగ బొందు నన్నే నరుండు. 25
పత్రంబుగాని పుష్పంబును గాని
ఫలమైన జలమైన భక్తితోడుతను
ఎవ్వాడొసంగిన నెంతయో ప్రీతి
ఆరగించుచునుందు నర్జునా నేను. 26
ఏ హోమమున్ జేతొ ఏదానమిడెదొ
ఏ తపముంజేతొ, ఏది భుజింతొ
అద్దాని నాకిడుమయ్య కిరీటి!
నీవెప్పుడైనను నెమ్మితోడుతను. 27
ఈ ప్రకారంబుగా నెల్ల కాలంబు
కర్మ సమర్పణ గావింతు వేని
పాప పుణ్యంబులే ఫలములైయుండు
కర్మబంధాలను గడచియు నీవు
చేరుకొందువు నన్ను చెన్ను మీరంగ. 28
సకల జీవులయందు సమముగా నుందు
వాడను నే గాన పార్థ లోకమున
ఏ యొక్కరుని మీద నిష్ట మనిష్ట
మనునవియే లేవు, అతి భక్తి గలిగి

ఎవరు నన్భజింౘ్రౌ యెల్ల వేళలను
వారు నాయందును, వారియందేను
వసియించుచుందుము వైనంబుగాను. 29
అతి పాపియైన నన్ను, నవరతంబు
పూజించువాని సత్పురుషుడటంచు
నెంచగా బడుచుండ దేలయంచనిన
ఆతడు స్థిరబుద్ధి యగువాడుగాన. 30
అట్టివాడును గూడ ఆశ్రయింపగను
శీఘ్రంబుగా ధర్మచిత్తుండునగుచు
శాంతితో వెల్గును శాశ్వతంబుగను
నా భక్తుడెవ్వడే నాటికింజెడద
టంచు ప్రతిజ్ఞనే నాచరించెదను. 31
అలఘు పాపాత్ములున్, ఆడవారలును
వైశ్యులున్ శూద్రులున్ భక్తినన్ గొలిచి
మరలతిరిగి రాని మంచి మోక్షంబు
అనుభవించుచు నుండి రానందముగను. 32
అటుపైన పుణ్యాత్ములగు బ్రాహ్మణులును
సద్భక్తి గల్గు రాజర్షులన్ వేరు
గా చెప్ప పనిలేదు కావునన్ దుఃఖ
వంతంబశాశ్వత వైఖరిం గలుగు
ఈ లోకమందున్న ఈవు నన్నెపుడు
భజియించుచుండుము భక్తితోడుతను. 33
అర్జునా! మనసు నాయందున నిల్పి
నన్నెగతియటంచు నమ్మి భావమున
నాదు భక్తుండవై నాకు నతులిడ
తుదకు నన్నేపొందుదువు తప్పకుండ. 34
ఉపనిషత్సారంబు యోగశాస్త్రంబు
నగు భగవద్గీతలందు పార్థునకు
శ్రీకృష్ణ పరమాత్మచే చెప్పబడిన
రాజవిద్య మరియు రాజ గుహ్యంపు
యోగ నామంబున నొప్పెడు యిద్ది
మంజరీ ద్విదపయై మహిని వెల్గొందు.



# 10

# శ్రీ భగవద్గీత

## 10వ అధ్యాయము

## విభూతి యోగము

అర్జునా నామాట లాలకిం చిటుల
సంతసించెడినీకు సద్హితంబిపుడు
చేయంగ నెంచి నే చెప్పభూనితిని
శ్రేష్ఠవాక్యంబొందుచెల్వుగా, వినుము. 1
నాదు భావంబును నయముగా తెలియ
గా లేవు దేవతా గణములు గాని
మరియు మహర్షి సమాజముల్ గాని
ఏలయనిన వారలెల్లర కంటె
మొదటివాడను గదా, భూరిభుజాఢ్య. 2
ఎవడు నాకు జననమేలేదటంచు
ఆదియుగనరానియట్టి వాడంచు
ఎరుగునో యాతండె యెల్లపాపముల
బాసినవాడంచు భావింపదగును. 3
మోహరాహిత్యమున్, బుద్ధియుజ్ఞాన
మున్, సత్యమోర్పును, పుట్టువున్ చావు
ధైర్యమున్ భయమును దానంబు, హింస
మొదలగు గుణములు భూతాళి కేనె
కలిగించుచున్నట్లు గమనింపుమీవు. 4-5
అర్జునా! సప్తమహర్షులున్ పిదప
సనకాదులును మరి స్వాయంభువాది
మనువులు గలిగిరి మద్ధ్యానసమున
పిమ్మట వారిచే వెలసిరీ జనులు. 6
ఎవడు నావైభవ మెరుగుచున్నాడొ
ఆతండు నిశ్చలమగు యోగమందు
సదలకుండగనిల్చు సత్యంబు గాను
యిందులో సందేహమేమియున్ లేదు. 7

జగము నావల్లనే జనియించె నంచు
ప్రాణులు నడచు నావలననే యంచు
భక్తులు నాయందె భావాల నుంచి
సేవలొనర్తు విశేషంబు గాను. 8
ధరణిలో భక్తులు తమ ప్రాణములను
మనసులు నాయందె మసలంగజేసి
నా మహిమల గూర్చి నాన్యంబు గాను
ఒకరి కొకరు బోధలొనరించుకొంచు
అద్భుతానందంబు నందుచున్నారు. 9
ఎల్లప్డు నాయందె యిమిడిన మనసు
గల వారలకునేనె కలిగింతు దేని
చే వారు నాయందు చేరంగగలరొ
అట్టిదౌ జ్ఞానంబు నతిశీఘ్రముగనె. 10
కరుణ వారియెడల గలవాడ నౌట
వారి మనసులలోపలజేరి నేనె
జ్ఞానదీపమున నజ్ఞాన తిమిరము
నణు మాత్రముంచక నంతంబొనర్తు. 11
అంతట నర్జునుండా కృష్ణుతోడ
ఈవె పరబ్రహ్మమీవె చూడంగ
పరమ పదంబును పావనుండీవె
శాశ్వతుండనియు తేజస్వియనియును
జన్మరహితుడని సకలస్వరూపు
డని యిట్లు నిను గూర్చి యగ్గించుచుంద్రు
వ్యాసుండు, నారదుండఖిల సన్మునులు
అసితుండు, దేవలుండను వారలెల్ల
రీవును స్వయముగా నెరిగించితిపుడు. 12-13
నీవు చెప్పినదెల్ల నిక్కువంబంచు
నా మదిలోపల నమ్మితిన్ కృష్ణ!
నీ నిజరూపము నెరిజూడ, దేవ
దానవాదులకేని తరముగాదు గద. 14
ఓ పురుషోత్తమా! ఓ భూత నాథా!
ఓ జగధీశ్వరా! ఓ పరంధామ!

నిన్నెరుంగగ నీకె నేర్పుండె గాని
ఇతరులు నిన్నెవ్వరెరుగంగ గలరు. 15
కావున నీవు లోకంబులన్నిటిని
వ్యాపించియున్నాడ వామహత్తులను
సంపూర్ణముగ చెప్ప జాలుదువీవె. 16
ఏ వస్తువులయందునేరీతి నిన్ను
నేధ్యానమందున నిలుపంగవలెనొ
అయావిభూతుల నాలించుటకును
కౌతూహలంబయ్యె కరుణింపు దేవ. 17
నీ యోగ మహిమను నీ విభూతులను
విపులంబుగా నాకు వివరింపుమయ్య
నీ యమృతపు నుడుల్ నేనెంత విన్న
తృప్తియొకింతయు తీరంగ లేదు. 18
అని మ్రొక్కుపార్థునకనె కృష్ణుడిట్లు
అంతంబులేనివైయలరారుచున్న
మద్విభూతుల విన మదిలోన నెంచి
వేడుచుంటివిగాన వివరింతు వినుము
అందులో కొన్నింటి నర్జునా నీకు. 19
అఖిల జీవుల హృదయాలలోపలను
ప్రత్యగాత్మగ నేనె భాసించుచుంటి
మరియు వానికి నాదిమధ్యాంతములును
నేనెయైయున్నాడ నిశ్చయంబుగను. 20
అదితిపుత్రుల విష్ణువను వాడనేనె
కాంతిచే వెల్గు భాస్కరుడును నేనె
ఆమరుత్తులమరీ చగుదును నేనె
ఇక చుక్కలందున నిందుండు నేనె. 21
దేవతలందున దేవేంద్రు డేనె
ఏనెమనస్సొదు నింద్రియాలందు
ప్రాణులలో తెల్వి పరికింప నేనె. 22
యక్షులలోన నేనగుదు కుబేరు
దగ్నినౌదు వసువులందున నేను
పర్వతంబుల మేరుపర్వతం బేనె. 23

అఖిల పురోహితు లందు శ్రేష్ఠుండు
ఆ బృహస్పతియు నే నరసిచూడంగ
సేనానులందున చేవగలట్టి
వాడు కుమారుండు వాకొన నేనె
సరసులన్నిటిలోన సాగరం బేనె. 24
ఋషులలో భృగుమహాఋషియును నేనె
వాక్కులలో ప్రణవంబును నేనె
యజ్ఞాలలో జపయజ్ఞంబు నేనె
హిమవంతమేనె మహిస్థిరా లందు. 25
చెట్టులలో రావి చెట్టును నేనె
మునులలో నారదమునియును నేనె
చెప్ప గంధర్వుల చిత్రరథుదును
కపిలుడ నే సిద్ధగణములయందు. 26
పాలసంద్రమునందు ప్రభవించినట్టి
ఉచ్చైశ్రవంబను ఉత్తమం బైన
గుఱ్ఱంబు నేనౌదు గుఱ్ఱంబు లందు
దంతులందైరావతం బౌదు నేనె. 27
ఆయుధంబులను వజ్రాయుధంబేనె
కామధేనువు నేనె కనగధేనువుల
ప్రాణియుత్పత్తికి బలమైనయట్టి
కారణభూతుడౌ కాముండు నేనె
పరగసర్పములందు వాసుకి నేనె. 28
నాగులలోన యనంతుండు నేనె
జలదేవతలయందు సక్రమంబుగను
వారినొసగునట్టి వరుణుండు నేనె
ఆ పితృదేవత లందర్యమయును
నియమించు వారల నేయముండగుదు. 29
అసురులయందు ప్రహ్లాదుండు నేనె
గణికులందరిలోన కాలంబు నేనె
అఖిల మృగాల సింహంబును నేనె
పక్షులందున గరుడ పక్షియున్ నేనె. 30
వాయువున్ నే వేగ వంతులయందు
శస్త్రధారుల రామచంద్రుండు నేనె

ఝషములలోన మొసలియును నేనె
నదులయందున వేల్పు నదియును నేనె. 31
అర్జునా యీ సృష్టులన్నిటికే నె
ఆది మధ్యాంతములై యుండి నాద
విద్యలందద్యాత్మ విద్య యున్ నేనె
వాదించు వారల వాదమున్ నేనె. 32
అక్షరాల అకార మయ్యెదన్ నే స
మాసాల ద్వంద్వసమాసంబు నేనె
కాలమున్ నేనె అకాలంబు నకును
ఫలమొసంగుచు నున్న బ్రహ్మయు నేనె. 33
రూపుమాపెడు మృత్యురూపుడు నేనె
ముందు పుట్టెడివారి పుట్టువున్ నేనె
స్త్రీలలో కీర్తియు, స్మృతియును, వాక్కు
ధారణా, సంపద, ధైర్యమున్, ఓర్పు
నేనెయౌచుంటిని నిక్కంబు గాను. 34
నయముగా సామగానాల లోపలను
నే బృహస్సామమై నెగడుచుండెదను
మార్గశీర్షమునేనె మాసంబులందు. 35
ఋతువుల వాసంతఋతువును నేనె
చూడ వంచకులందు జూదమున్ నేనె
తేజమెసగువారి తేజమున్ నేనె
జయశీలురందున జయమును నేనె
యత్నశీలురలో ప్రయత్నమున్ నేనె
సాత్వికులందలి సత్వమున్ నేనె. 36
వృష్ణి వంశజులందు కృష్ణుడు నేనె
పంచపాండవులందు పార్థుండు నేనె
మునుల లోపల వ్యాసమునియును నేనె
కవులలో శుక్రుండు గాంచంగ నేనె. 37
దండించు వారలదండమున్ నేనె.
పరులగెల్వ గల ఉపాయంబు నేనె
అతి రహస్యంబులయందు మౌనమును
జ్ఞానవంతులయందు జ్ఞానము నేనె. 38

వేయి మాటలవేల విను మర్జునుండ
జగమున స్థావర జంగమంబయిన
సకల జీవులకు బీజంబునే నయితి. 39
అర్జునా, దివ్యంబులై వెల్గుచున్న
అస్మద్విభూతుల కంతంబు లేదు
అయిన నిప్పుడు వానియందులో కొన్ని
వినిపించినాడను విశదంబుగాను. 40
ఐశ్వర్యయుక్తంబునై కాంతియుతము
నై, శక్తియుతమునై అలరారుచున్న
ప్రాణులెయ్యవియుందు పరికింపగాను
అవి యన్నియును నాదు అంశంబుచేత
కలిగినవంచును గమనింపుమీవు. 41
అర్జునా యీరీతి నంతంబులేని
ఈ విభూతులచేత నేమిలాభంబు
నీకు కల్గగలదు, నేనీ జగత్తు
నంతయు నాయొక్క అంశంబుతోనె
వ్యాపించియున్నట్లు భావింపు మీవు. 42
ఉపనిషత్సారంబు, యోగశాస్త్రంబు
నగు భగవద్గీతలందు పార్థునకు
శ్రీకృష్ణ పరమాత్మచే చెప్పబడి వి
భూతియోగము పేరు పొసగిన యిద్ది
మంజరీ ద్విపదగా మహిని వెల్గొందు.



## 11

# శ్రీ భగవద్గీత

## 11వ అధ్యాయము
## విశ్వరూప సందర్శన యోగము

శ్రీకృష్ణ మూర్తి నీచే చెప్ప బడిన
అత్యుత్త మము రహస్యంబును మరియు
అధ్యాత్మమను పేర నలరారుచున్న
ఏ వాక్యమును నాకు నెరిగించి నావొ
ఆ వాక్యమున నాదు అజ్ఞానమెల్ల
సంపూర్తిగా వీడి చనెను మహాత్మ. 1
కంజాక్ష నీదగు కరుణచే నేను
తెలిసికొంటిని తేట తెల్లంబుగాను
ప్రాణుల జన్మ నిర్వాణముల్ మరియు
మానితమౌ నీదు మాహాత్మ్యములను. 2
ఓ పరమేశ్వరా! ఒప్పుగా నీవు
వాకొన్నదంతయు వాస్తవంబంచు
విశ్వసించితి నేను వినుత చారిత్ర!
నీ విశ్వరూపంబు నే చూదదలచి
ప్రార్థించుచున్నాడ పరమేశ యిపుడు. 3
నీ విశ్వరూపంబు నేచూచుటకును
తగుదునని మదిలో తలచితివేని
అవినాశియైనట్టి ఆ విశ్వరూప
మిక నాకు జూపించుమో పరంధామ! 4
అని పార్థుడీరీతి నర్థించి నంత
శ్రీకృష్ణుడిట్లనె చెలువు మీరంగ
పార్ధ యలౌకిక ప్రాభవం బొప్ప
వివిధ రూపాలతో వివిధ వర్ణాల
తో నసంఖ్యాకమైతోచుచు నున్న
నారూపములజూడు నయన పర్వముగ. 5

చూడు మర్జున నీవు సూర్యాశ్వినులను
రుద్రవసువుల మరుత్తులన్ మరియు
పూర్వంబు నీవెందు పొడగాంచనట్టి
ఆశ్చర్య రూపాల నన్ని నాయందు. 6
పార్థ యీసకల ప్రపంచంబు నందు
ఇంకదేనిని దేని నీక్షింపదలతొ
అవియన్ని మత్తను వందున నొక్క
చో గల వానిని చూడు మీవిపుడు. 7
నీ మాంసమయమైన నేత్రాలతోడ
కాంచంగ జాలవుగాన నన్నిపుడు
దివ్యచక్షువులిత్తు దేదీప్యమైన
విశ్వరూపము జూడు వీరావతంస. 8
అని ధృతరాష్ట్ర మహారాజ! అపుడు
పార్థునకున్ కృష్ణపరమాత్మ దివ్య
దృష్టినొసంగియు దివ్యమౌతనదు
విశ్వరూపము జూపె వేడుక మీర. 9
పెక్కు నేత్రంబులు పెక్కు ముఖములు
పెక్కు దివ్యములైన పెద్దహారములు
దివ్యపుష్పసరులు, దివ్యవస్త్రములు
దివ్య గంధపు పూతతో గూడినదియు
అంతంబుగనరాని యట్టిది, దివ్య
కాంతులతోడ ప్రకాశించుచున్న
విభ్రాంతిగొల్పెడి విశ్వరూపమును
పార్థున కప్పుడు పరమాత్మజూపె. 10-11
పెక్కు విధాలుగా విభజింపబడిన
సకల జగత్తును చక్కగా క్రీడి
శ్రీకృష్ణదేహాన చెన్నుమీరంగ
ఒకచోట నున్నట్టు లొప్పుగా గాంచె
కోటిసూర్యుల కాంతిగొనగోటమీటు
అమ్మహాత్ముని దేహమందున తాను. 12-13
ఆపైన అర్జునుండాశ్చర్యమంది
గగురుపాటును మేన గల్గుచుండగను
విశ్వరూపము తోడ వెలుగుచు నున్న
భగవానునకు భక్తి పరవశత్వమున

శిరసా నమస్కృతుల్ చేసి, చేతులను
జోడించుకొని యిట్టి చొప్పునంబలికె. 14
దేవ! నీతనువున నెల్లదేవతల
సకలచరాచర సముదయములను
సృష్టికర్తను మరి ఋషులనెల్లరను
ద్వివ్యసర్పములను తిలకించుచుంటి. 15
అన్నితావుల పెక్కు హస్తముల్ కనులు
కడుపులు ముఖములు గలవాని గాను
కాంచుచు నున్నాడ గాని మహాత్మ
ఆద్యంత మధ్యాల నరయలేకుంటి. 16
గదకిరీటమును చక్రంబును గలిగి
అన్ని దిక్కులనిండినట్టి వానిగను
అగ్నిసూర్యుల కాంతి నణచుచునున్న
తేజస్విపంచును తెలిసికొంచుంటి. 17
అక్షరంబగు బ్రహ్మయగుదవు నీవు
భువనాలకాధారభూతుడ వీవు. 18
రహినాది మధ్యాంత రాహిత్యుడుగను
అంతులేని పరాక్రమాన్వితుడుగను
రవిచంద్ర నేత్రుగా, రాజిల్లుచున్న
అగ్నిహోత్రమువంటి ఆస్యంబుగలుగు
వానిగా, సకల ప్రపంచంబు స్వీయ
కాంతిచే దహియింప గలవానినిగను
నిను గాంచుచుంటిని నేను మహాత్మ. 19
భూ నభాలకు మధ్య పొదకట్టుచున్న
ఈ ప్రదేశంబెల్ల యీ వొక్కరుడవె
ఇమిడియున్నాడవు, ఇంకను భయము
నాశ్చర్యముంగొల్పునట్టి నీరూప
మాలోకనముచేసి అన్ని లోకములు
భీతిల్లుచున్నవి పెద్దగా నిపుడు. 20
సురలెల్లరును వచ్చి చోద్యంబుగాను
నీ విశ్వరూపాన నెరి చేరుచుండ్రి
సిద్ధులున్ మౌనులు చేతులనెత్తి
అన్ని లోకాలకు నగుగాక శుభము

లనిపల్కి సంపూర్ణమగు స్తోత్రములను
గావించుచుండిరి ఘనతర భక్తి. 21
సిద్ధులు సాధ్యు లశ్వినులును మరియు
యక్ష గంధర్వులు అసురులున్ రుద్ర
సూర్యులు వసువులు చూచుచు నుంద్రి
ఆశ్చర్యచకితాత్ములగుచును నిన్ను. 22
కరములూరులు కాళ్ళు కడుపులు మరియు
కోరలున్ గల నిన్ను కోరికన్ జూడ
భయముప్పతిలుచుండె భావాన నాకు. 23
గగనంబు నొరయు నంగంబుతోడుతను
ప్రాజ్వల్యమాన నేత్రాల తోడుతను
వెలుగొందు నినుజూడ విశ్వస్వరూప
నే ధైర్యమును శాంతినిన్ బొందకుంటి. 24
క్రూరదంష్ట్రలతోడ గూడినట్టివియు
ప్రళయాగ్నికిన్ ప్రతి వచ్చునట్టివియు
నైన నీ ముఖముల నయనాలతోడ
తిలకింప నేదిక్కు తెలియకున్నాద
కలుగకుండె సుఖముగాన నోదేవ
కరుణతో నన్నేలు కదువడిన్ నీవు. 25
ఈధార్తరాష్ట్రజు లీద్రోణ భీష్మ
కర్ణాదులును వారికగు సేనలున్ను
మన సేనలో ముఖ్యమగు వారలున్ను
ఉరవడి నీనోట నురుకుచున్నారు
కొందరు నీనోటి కోర్ల సందునను
చిక్కి చిదురుచున్న శిరములతోడ
కనబడుచున్నారు కాంచంగ దేవ. 26-27
ధర వీరులందరున్ తప్పకన్ వచ్చి
అగ్నిశిఖల జిమ్మునట్టి నీ నోళ్ళ
చేరుచునుండిరి, శీఘ్రమేనదులు
సాగరంబును జేరు చందంబుగాను. 28
మిడుతతండంబులు మిగుల వేగముగ
మరణంబు కొరకునై మంటబడుగతి
చావు కొరకును నైజనులెల్ల రిపుడు
పడుచుండినారు నీ వక్త్రంబులందు. 29

ఓ విశ్వరూపకా! ఓ విష్ణుమూర్తి
వహ్నికీలలుగల వదనాల తోడ
మేటివీరుల నెల్లమ్రింగు చున్నావు
భయదమౌనీద్యుతుల్ వ్యాపించి జగతి
చెచ్చెర తాపంబు చేయుచునుండె. 30
దిక్కులన్నిటియందు తెరపింత లేక
నిండియుండినయట్టి నీవెవ్వ రౌదొ
ఎరిగించుమో దేవ! ఎందుకంచనిన
నీ ప్రవృత్తి నెరుగ నేనొకింతయును
ఆదిపూరుష నీకు నంజలులిడుదు. 31
పార్థుడిట్లడుగగా భగవానుడనియె
అర్జునా! లోకసంహారంబు కొరకు
గమకించు చున్నట్టి కాలుండు నేనె
ఇపుడు యుద్ధావనికేతెంచియున్న
శత్రువీరుల నీవు చంపకుండినను
ఇందు జీవించు వారెవ్వరున్ లేరు. 32
కావున నర్జునా కలతలన్ వదలి
పగవారలన్ గెల్చి పడయుము కీర్తి
తోడుత రాజ్యంబు తోషంబు మీర
ఈ రాజవ్రాతంబు లెల్ల నాచేత
నీల్గిన వెప్పుడో నీవు నిమిత్త
మాత్రుడుగానుండు మర్జునా కలన. 33
నాచేత పూర్వమే నాశనంబయిన
ద్రోణభీష్మాదుల దోర్బలయుతుల
కర్ణాదులను యింక కలనిలోనున్న
ఇతరవీరుల గూడ యీవెమ్రందింపు
భయము వీడుము గెల్వువచ్చుతప్పకను. 34
అంచుపల్కిన కృష్ణునాలించి క్రీడి
భయముచే కంపము వదలెల్లపొడమ
కరములు ముకుళించి గద్గదికమెసగ
పలికె నీ విధముగా భగవాను తోడ. 35
నీదు నామంబును, నీదు మాహాత్మ్య
మభినుతించుచు ప్రజహర్షించుచుండ్రి
భీతి రక్కసిమూక పేరెంబు నిడియె

సిద్ధులు వందనాల్ చేయుచున్నారు
ఇవియన్ని తగినవియే దేవ నీకు. 36
ఓ జగదాశ్రయా! ఓ దేవ దేవ!
చక్కగా యోచింప సదసత్తులకును
పరముగానుండెడి పరమాత్ముడవును
అక్షరమగు బ్రహ్మమైన వాడవును
నగు నీకు నేరీతి నంజలు లిదరు? 37
ఆది దేవుడవీవె ఆధారు డీవె
సర్వజ్ఞుడవు నీవె సర్వస్వమీవె
నీయొక్కరునిచేత నిఖిల జగములు
వ్యాపింప బడియుండె వాస్తవంబుగను. 38
వాయువు యముడును వరుణుడగ్నియును
బ్రహ్మయు చంద్రుండు బ్రహ్మ జనకుడు
నీవె యైతివిగాన నే చేయుచుంటి
వేవేల దండాలు వినయంబుతోడ. 39
సర్వరూపుడవగు స్వామి శ్రీకృష్ణ!
నీకు ముందును వెన్కనెమ్మితోడుతను
గావింతు దండముల్ కరుణ గైకొనుము. 40
దేవ నీ మహిమను తెలియంగ లేక
చనువుతోడుతమున్ను సఖుడవంచెంచి
ఓయాదవాయని ఓ కృష్ణ యనియు
నినుగూర్చి చుల్కన నేబల్కినట్టి
అపరాధములనెల్ల నప్రమేయుడగు
నీవు క్షమింపగా నేవేడుచుంటి 41-42
అసమాన విక్రముడగు కృష్ణ దేవ
ఈ సకలావని కీవెతండ్రివియు
సర్వశ్రేష్ఠుడవును సద్గురుడువును
పూజనీయుడవునై పొదలుచున్నావు
ముల్లోకముల నీ సముడెవడు లేదు
ఇక నిన్నుమించు వాడెట్లుండగలదు. 43
అందుచే నీకు సాష్టాంగ మెరగియు
ఈశ్వరుడవు నుతియింప నర్హుడవు
నగు నిన్నువేడెద, నక్కటికమున
తనయుని తప్పును తండ్రివిధమున

స్నేహితు దోషమున్ స్నేహితుని వలె
ప్రియురాలి తప్పును ప్రియుడు క్రమమున
నీవు నా తప్పులన్నింటిని గూడ
క్షమింపగోరెద సరసీరుహాక్ష. 44
ఇది వరకెరుగని యీ విశ్వరూప
మీక్షింప నానంద మెంతయో కలిగె
కాని భయముచేత కలగి నా మనము
వ్యధచెందుచుండె నత్యధికంబుగాను
కావున జగదీశ! కరుణించి యిపుడు
మునుపటి నీ రూపమును జూపుమయ్య. 45
ఓ జగద్రూపకా! ఓ విశ్వమూర్తి!
మకుటమున్ గదచక్ర మహిత భూషణము
లలరార గానాల్గు హస్తాలు గలుగు
నీ సౌమ్యరూపంబు నే చూడదలతు. 46
అని వేడు పార్థనకనె కృష్ణుడిట్లు
కవ్వడీ! పరిపూర్ణ కాంతి గలదియు
అఖిల జగద్రూపమైనట్టిదియును
అంతంబులేనిది ఆద్యమైనదియు
ఇతరులెన్నడుగూడనెరుగ నట్టిదియు
నగు విశ్వరూపంబు నస్మదీయమగు
యోగ మహిమచేత నొనర జూపితిని 47
ఈ విశ్వరూపంబు నింతకు మునుపు
ఎవ్వారు కనకుండి, రిప్పుడు నీవు
కాంచినాడవు నాదు కరుణ గల్గుటను
తపములచే గాని దానాల గాని
శ్రౌతాది కర్మలు సల్పియుం గాని
ఈ విశ్వరూపంబు నీక్షింపలేరు. 48
ఇట్టి భీకరరూప మీక్షించి నీవు
భయ విహ్వలత్వాలబడయంగబోకు
మని పల్కి శ్రీకృష్ణుదాపూర్వ రూప
మునుజూపె క్రీడికి ముదము చేకూర. 49
ఓ కురుకులనాథ! ఓ ధృతరాష్ట్ర!
శ్రీకృష్ణుడారీతి చెప్పి పార్థునకు
తన పూర్వరూపమున్ తగజూపి మరల

తన సౌమ్యరూపమున్ తాను ధరించి
పార్థునియోదార్చి భయమెల్లదీర్చె. 50
అర్జునుండపుడు తాననె కృష్ణుతోడ
శ్రీకృష్ణమూర్తి నీ చెలువైన, మనుజ
రూపంబు గనుగొన రూఢిగా మనము
కుదుటబడెను నాకు, కుదిరె స్వస్థతయు. 51
అనగ కృష్ణుడు వల్కె నర్జును నకును
పార్థ నీచే చూడబడినట్టి నాదు
ఈ స్వరూపము జూడ నేరికింగాదు
వాంచింతురెపుడు దేవతలును గూడ
ఈ రూపముంజూడనెంచి యాత్మలను 52
ఈవునన్నేరీతి నీక్షించి నావొ
అట్టి రూపముతోడ నలరారు నేను
తపము యజ్ఞము వేద దానాల వలన
శక్యంబుగాబోను చక్కగా జూడ. 53
చక్రతనూజుడా! శత్రుసంహార!
ఇట్టి రూపము గల్గు యేనేక భక్తి
ఎవవ్వారి కుందునో, ఎరిగి కౌంటకును
దర్శించుకౌంటకు, దరిజేరుటకును
అవ్వారికి సులభుదయ్యేదన్ నేను. 54
కర్మనా కొరకునై గావించు వాడు
చిత్తాన ననుభక్తి సేవించువాడు
మమతాను రాగాలు మానినవాడు
పొందుచుండును నన్ను భూరిభుజాద్య. 55
ఉపనిషత్సారంబు యోగశాస్త్రంబు
నగు భగవద్గీతలందు పార్థునకు
శ్రీకృష్ణ పరమాత్మచే చెప్పబడిన
విశ్వరూపపు యోగవిధ మిట్టి రీతి
మంజరీ ద్విపదయై మహి వెలుగొందు.



## 12

# శ్రీ భగవద్గీత

## 12వ అధ్యాయము

## భక్తి యోగము

అచ్యుతా! మనము నీయందున నిల్పి
భక్తిపూజించెడి వారెరుగుదురొ
అటుగాక నక్షరు ధ్యానించువార
లెరుగుదురో యోగమెల్ల బాగుగను
అనవిని శ్రీకృష్ణుడనె పార్థునకును. 1
చిత్తమెల్లప్పుడు చేర్చినాయందె
శ్రద్ధతో పూజలు సేయుచు నుండు
వారలే శ్రేష్ఠులై వరలు చుండెదరు
ఎల్ల యోగులలోన నెంచంగ పార్థ. 2
ఎవడు తా నింద్రియాలెల్లను దూల్చి
సకల భూతములందు సమదృష్టి బరపి
చింతింప మనసుకు చిక్కనట్టిదియు
కన్నులతో జూడ కానరానిదియు
ఇట్టిదట్టిదియంచు నెన్న రానిదియు
నిర్వికారంబయి నెగడెడి నదియు
అన్ని తావులయందు వ్యాపించినదియు
నగు అక్షరపు బ్రహ్మధ్యానించు వారు
ననుబొందు చున్నారు నయముగా నెపుడు. 3-4
అవ్యక్త బ్రహ్మంబు నందాశగలుగు
వారికి నిర్గుణోపాసకు కంటె
కష్టమధికమయి కాన్పించుండు
అదియెట్టులన్న దేహాభిమానులకు
అతి కష్టమునగాని అందబో దద్ది. 5
అర్జునా! ఎవరు నాయందు సమస్త
కర్మల నర్పించి గతినే నెయంచు
నన్నె పూజించుచు నన్నెధ్యానించు

చున్నారో వారినే సురుచిరంబుగను
భవ పయోనిధి నుండి బాగు చేసెదను. 6-7
అర్జునా! మనసు నాయందునే స్థిరము
చేయుము, బుద్ధిని చేర్చు నాపైన
అటుపైన నీవు నా యందెయుండెదవు
ఇందు సందేహ మొకింతయున్ లేదు. 8
అర్జునా! ఒకవేళ నా ప్రకారముగ
సల్పంగ నీకును శక్తి లేకున్న
అభ్యాస యోగాన నైనను నన్ను
పొందగా యత్నంబు పొనరింపు మీవు. 9
ఒకవేళ అభ్యాస మొనరించుటకును
అసమర్థుడవెయైన నస్మదీయంపు
కర్మలందాసక్తి గల వాడవగుము
కర్మలా రీతిగా గావించియైన
మోక్షసిద్ధిని నీవు పొందంగ గలవు. 10
సల్పుటకు నిదియు శక్తి లేకున్న
అటుపైన నెమ్మది నరికట్టి సర్వ
కర్మఫలంబుల గణియింపబోక
త్యాగమొనర్చుము తప్పకుండగను. 11
అభ్యాసమున కంటెనగు మేలుజ్ఞాన
మా జ్ఞానమునకంటె నగు మేలుధ్యాన
మాధ్యానమునకంటె నగు మేలు కర్మ
ఫలమును వీడుట పార్థనిక్కముగ
అద్దానిచే శాంతినందు మానవుడు. 12
సకల భూతములందు సముడైనవాడు
కరుణయు మైత్రియు గలిగినవాడు
అహమును మమకార మణచినవాడు
సుఖదుఃఖ మొకరీతి జూచెడి వాడు
ఒరులే మొనర్చిన నోర్చెడి వాడు
యోగంబుతో గూడియుండెడి వాడు
నిశ్చయంబును మది నిల్పెడి వాడు
బుద్ధి నాయందునే పొందించువాడు
సేవలన్నియు నాకె చేసెదు వాడు
నాకు ప్రియుండగు నయముగా పార్థ. 13-14

ఎవ్వాని వలన తామించుకంతయును
భయము లేకుందురో ప్రజలు లోకమున
ఎవడు తోషము కోపమెనయంగబోడొ
వాడు నాకిష్టుండు వసుధలోపలను. 15
కోరికలెవ్వియు కోరని వాడు
కార్యసామర్థ్యము కలిగిన వాడు
కర్తనే నని మది కలుగని వాడు
వ్యాకులత్వము లేక వరలెడి వాడు
ఎవడుండునో భువినెంచి చూడంగ
అవ్వాడె నాకిష్టుడగు చుండునెపుడు. 16
తోషంబు ద్వేషంబు తెలియగా దిగులు
శుభము నశుభమును సుష్టుగా నెవడు
వదలియుండునొ యట్టి భక్తుండు నాకు
ఇష్టుడౌచుండును యెప్పుడేనయును 17
మిత్రునియందు నమిత్రుని యందు
మానంబు నందవమానంబునందు
సౌఖ్యదుఃఖములందు చలివేడియందు
నిందాస్తుతులయందు నిగ్రహము గల్గి
మౌనవంతుండయి మనన శీలుండై
దొరికినదాన సంతోషంబుగనుచు
సంగంబు వీడి, వాసస్థానమున్ను
నిర్దిష్టముగ లేక, నిశ్చయంబయిన
బుద్ధితో నను గొల్చు పురుషుండె నాకు
ప్రియుడని చెప్పంగ వీలౌను పార్థ. 18-19
పరమ గతిగ నన్నె భావించి యెవడు
శ్రద్ధ గలిగి మోక్ష సాధనంబయిన
ఈ ధర్మ మార్గంబు నెల్లకాలంబు
నాచరించునొ యిష్టమగువాడె నాకు. 20
ఉపనిత్సారంబు, యోగశాస్త్రంబు
నగు భగవద్గీతలందు పార్థునకు
శ్రీకృష్ణ పరమాత్మచే చెప్పబడిన
భక్తియోగం బిద్ది, బాగుగా తెలియ
మంజరీ ద్విపదయై మహిని వెల్గొందు.

(13)

# శ్రీ భగవద్గీత

## 13వ అధ్యాయము

## క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ యోగము

అంత శ్రీకృష్ణున కనె నర్జునుండు
పలుకుము శ్రీకృష్ణ ప్రకృతియనంగ
నెద్దియో పూరుషుడెట్టిదో యెద్ది
క్షేత్రంబొ యెవ్వాదు క్షేత్రజ్ఞుదగునొ,
ఏది జ్ఞానంబొ, మరేది జ్ఞేయంబొ
అన విని పార్థున కనె కృష్ణుడిట్లు. 1
అర్జునా! దేహమేయగును క్షేత్రంబు
దాని నెరుగువాడె తనరు క్షేత్రజ్ఞు
డంచును తెలిసినయట్టి వారెల్ల
పలుకుచునుందురు బాగుగా నిలను. 2
అర్జునా, నన్ను దేహాలలో నున్న
క్షేత్రజ్ఞుడనుకొమ్ము చిత్తంబు నందు
క్షేత్రమున్ మరియును క్షేత్రజ్ఞునెరుగు
జ్ఞానమెద్దియొ సత్య జ్ఞానంబునదియె. 3
అక్షేత్ర మేదియో, అదియెట్టి దౌనొ
ఎద్దాని నుండితానెటు జన్మగనెనొ
ఎవ్వడో క్షేత్రజ్ఞుడెంత ప్రభావ
సంపన్నుడో విను సంక్షేపముగను. 4
వేదాల లోపల వేర్వేరు గతుల
కన్పించు, నిది ఋషి గణములచేత
బాగుగా నిశ్చయింపగ బడియుండె
వావిరి యాబ్రహ్మ వాక్యాలయందు
గూడ కానగవచ్చు కుంతీ తనూజ. 5
పంచమహాభూత వర్గంబు, నహము
బుద్ధియు, నటు మీద మూల ప్రకృతియు
క్రమముగా పదియు నొక్కండింద్రియాలు

ఇంద్రియ విషయంబు లెంచగా నైదు
కాంక్షయు, ద్వేష సౌఖ్యములు దుఃఖంబు
దేహేంద్రియాదుల తెలివి ధీరతయు
ననువానితోగూడి అనయంబు మార్పు
చెందుచుండెడి దౌను క్షేత్రంబనంగ. 6-7
ఆత్మ సంస్తుతి లేక అలరారుచుంట
అడంబరము వీడి అణగితా నుంట
ప్రాణులెవ్వానిని బాధింపకుంట
ఓర్పును మదిలోననుంచుకొంటయును
శుద్ధితో నెప్పుడు శోభిల్లు చుంట
మనసును స్థిరముగా మలచుకొంటయును
శబ్దస్పర్శాదుల సక్తి లే కుంట
అహమును మమకార మాపుకొంటయును
సతిసుతాదులయందు శ్రద్ధ లేకుంట
కష్టసౌఖ్యము లొక్కకంట నేగనుట
భగవంతునందున భక్తితో నుంట
ఏకాంతమగుచోటి కేగియునుంట
ఆత్మనిష్ఠ గలిగి అనయంబు నుంట
అనెడివన్నియు జూడనగును జ్ఞానంబు
లన్యంబులయినవి అజ్ఞానమంచు
తెలిసికొనుము నీవు ధీరవరేణ్యా! 8-9-10-11-12
తెలియదగినదేదొ దేనితెలియగ
ఉత్తమమగు మోక్ష మొందునో నరుడు
దాని నిపుడు చెప్పదలచిన వాడ
బాగుగా నాలింపు పార్థ నీవిపుడు. 13
ఆదిలేనిదియగు నా పరబ్రహ్మ
సత్తుగాదదియు నసత్తునుగాదు
సర్వదిక్కులయందు స్వావయవముల
వ్యాపించి యుండెను పాండుతనూజ. 14
వినుమింద్రియ గుణాల వెల్గించు నెద్ది
అంటక నెద్దాని నలరారు నెద్ది
గుణములు లేకయు గూడనుండెద్ది
వేగుణ భోక్తయై వికసించు నెద్ది
ప్రాణుల నంటక బయలుండు నెద్ది

అఖిలాంతరస్థయై నట్టిది యెద్ది
కదలుచుండెడి దెద్ది కదలని దెద్ది
కనగదాదాపు నే కనుపించు నెద్ది
విభజింపబడకుండ వెలసెడి దెద్ది
వివిధ రూపాలతో వేసాగు నెద్ది
జీవరాశుల నెల్ల సృష్టించు నెద్ది
పోషించి అంతంబు పొనరించు నెద్ది
దివిని సూర్యాదుల దీప్తి యింకెద్ది
జ్ఞాన దృష్టిని జూడజాలిన దెద్ది
అదియె బ్రహ్మంబని అరయుమీవింక. 15-16-17-18
ఈ ప్రకారంబుగా నిపుడు క్షేత్రమును
జ్ఞానంబు జ్ఞేయంబు సంక్షేపముగను
చెప్పంగబడెను నాచేత నవ్వాని
తెలిసిన భక్తుదేతెంచు నాకడకు. 19
ఈ ప్రకృతి పురుష లిద్దరకున్ను
ఆదిలేదని యెంచు మాత్మలో నీవు
ఎల్లవికారము లెల్ల గుణములు
ప్రభవించు చుండెను ప్రకృతి వలనను. 20
కార్యకారణములు కల్గించు, దాన
ప్రకృతియే హేతువై వర్తిల్లునంచు
వచ్చిన సుఖదుఃఖ వర్గాల నెల్ల
అనుభవించగ హేతువగుచుండు పురుష
డని చెప్పుచుండెద రాత్మజ్ఞులెల్ల. 21
పురుషుదు ప్రకృతిలో పుట్టు విషయము
లనుభవించుచునుండు, నాతండు మరియు
ఆవిషయంబుల యనుభవంబునను
ఉత్తమాధమ జన్మలొందుచు నుండు. 22
ఆరయ పూరుషుడటు మేనులందు
అధివసించినను వేరగు వాడటంచు
అనుమతి నిడెడి వాడంచును, ననుభ
వించెడి వాడని, విపులంబుగాను
భరియించువాడని, పరమాత్ముడంచు
సాక్షిభూతుండని, సకలంబునకును
పరమేశ్వరుండని పలుకంగబడియె. 23

పుడమిలో నెవ్వడీ పురుషుని మరియు
గుణములతోడుత గూడియున్నట్టి
ప్రకృతినెరుంగునో బాగుగా నాత
దేవిధంబుగ నున్ననేమి జన్మంబు
మరల పొందగబోడు మఘవతనూజ. 24
ధ్యానయోగముచేత తనయందునాత్మ
శుద్ధమై మనసుచే చూచు చున్నారు
కొందరు, నికనట్లె కొందరు సాంఖ్య
యోగంబుచే, కర్మయోగంబుచేత
కొందరు కనుగొంద్రు కోరికల్ దీర. 25
అట్లు తెలియలేని యజ్ఞులౌ వారు
వినియు నితరులచే విశ్వేశు గొల్తు
శ్రవణత త్పరులగు జనములు గూడ
తరియించుచుందురు తప్పకుండగను. 26
స్థావర జంగమాత్మక మగునట్టి
వేయవిగలుగునో యీ లోకమందు
అవియన్నియుం గూడ అర్జునా నీవు
క్షేత్రమున్ మరియు నాక్షేత్రజ్ఞ వలన
కలుగుచున్నట్లు గాగమనింపదగును. 27
సకలంబు లోపల సమముగానున్న
ఆ పరమాత్మ దే హాలు పోయినను
తాను నశింపక తనరుచున్నటుల
చూచువాడే యగు చూచినవాడు. 28
అది యెట్టులన్నచో అన్నిటియందు
బాగుగా వెల్గెడి పరమాత్మ సమము
గా వ్యాప్తుడైనట్లు గాంచు మనుజుడు
తనయాత్మ నెప్పుడు తాహింస జేసి
కొనబోడు గావున కొసకు నుత్కృష్ట
మోక్షంబు నేవాడు పొందుచున్నాడు. 29
ఎవడు కర్మంబులనెల్ల ప్రకృతియె
కావించుచున్నట్లుగాను నికటులె
ఆత్మతాకర్తగాదని చూచువాడె
వాస్తవముగ జూచువాడగున్ పార్థ! 30

ఎపుడు వేర్వేరగు యీలోకమంత
ఒకదాని లోపలే ఉన్నట్లు గాను
మరియును నద్దాని మార్గంబు గానె
విస్తరించినయట్టు లీక్షింప గలడొ
అపుడె తాబ్రహ్మంబునందు మానవుడు. 31
అర్జునా! ఆదిలే నట్టి వాడగుట
గుణములతో గూడుకొనని వాడగుట
ఈ పరమాత్మ శరీరములందు
నుండియున్ తానేమియొనరింపకుండె. 32
వ్యాపించి సర్వత్ర ఆకాశమెటుల
అంటంగబడకుండు ఆ ప్రకారంబె
సకలదేహాలలో సమముగానున్న
పరమాత్మ గుణదోష వర్గాలచేత
అంటంగ బడకుండె, నర్జునా మరియు. 33
సకలలోకంబును చక్కగా నెటుల
భాసింపచేయునో భాష్కరుండొకడె
అటులనే క్షేత్రజ్ఞుడగు పరమాత్మ
అన్నింటి దేహాల నందంబుగాను
చేయుచుండెను కాంతిచే వెలుంగగను. 34
క్షేత్రంబునకు నింక క్షేత్రజ్ఞునకును
కల్గుభేదంబును గమనించువాడు
ప్రకృతి నుండి విముక్తి బడయునుపాయ
మెరిగి తాముక్తికి నేగుచున్నాడు. 35
ఉపనిషత్సారంబు, యోగశాస్త్రంబు
నగు భగవద్గీత లందు పార్ధునకు
శ్రీకృష్ణుడు పలుకు క్షేత్రక్షేత్రజ్ఞ
భేదయోగంబిది విపులంబుగాను
మంజరీ ద్విపదయై మహిని వెల్గొందు.

## 14

# శ్రీ భగవద్గీత

## 14వ అధ్యాయము

## గుణత్రయ విభాగ యోగము

అర్జునా దేనిచే అఖిల మునీంద్రు
లుత్తమోత్తమ మోక్ష మొందుచున్నారొ
అట్టి మహోన్నత మైన జ్ఞానంబు
బోధింప నుంటిని పూర్తిగా, వినుము. 1
ఈ జ్ఞానమును పొందిరేనియు జనులు
ఐక్యంబు నాతోడ నందిన వారై
మరల తిరిగిరాని మంచి మోక్షంబు
అనుభవించుచునుందు రానందముగను. 2
క్రీడి సర్వోత్పత్తికిని స్థానమగుచు
అలరు ప్రకృతి, దానియందున నేను
చేతనత్వము గల్గు జీవ బీజమును
పొందుగా నిడ గల్గు భూత గణములు. 3
దేవమనుష్యాది తెగలలో బుట్టు
తనువులన్నింటికి తల్లియౌ ప్రకృతి
దానబీజంబిడు తండ్రి నే నౌదు
వాస్తవంబియ్యది పాండుతనూజ! 4
ప్రకృతివలన బుట్టి వర్తిల్లుచున్న
సత్వరజస్తమాల్ చావు లే నట్టి
ఆత్మను దేహంబు నంద మోఘముగ
కట్టివేయుచు నుండె కదలనీకుండ. 5
గుణములలో సత్వ గుణము నిర్మలము
కావున నద్ది ప్ర కాశమ్ము తోను
అనుపద్రవంబుతో నలరారుచుండి
సౌఖ్య సుజ్ఞానాలసక్తి జీవులను
బంధించు చున్నది బహుతీవ్రముగను. 6

దృశ్యములందు ప్రీతిని గూర్చునదియు
కోర్కెలాసక్తులన్ గూర్చెడిదనియు
గుర్తింపు మీ రజోగుణమును నీవు
అయ్యది కర్మలం దాసక్తి చేత
ఆత్మను బంధించు ననఘ చరిత్ర. 7
పార్థ! అజ్ఞానాన ప్రభవించినదియు
అవివేకమును గూర్చునట్టి దనియును
ఈ తమోగుణమును యెంచుముమదిని
అది పరాకును నిద్రయనువానిచేత
కట్టివేయుచు నుండె ఘనముగానాత్మ. 8
సత్వగుణము జేర్చు సౌఖ్యాన, నిక ర
జోగుణ మదియుతా చొప్పించు కర్మ.
మోహంబునందు తమోగుణంబింక
జీవునింతా జేర్చు చెచ్చెరన్ పార్థ ! 9
ఈ గుణత్రయమునందేది యధికము
గా నుండునో యది కదమరెండిటిని
అణగించియును తన దౌప్రతాపమును
అంతట జూపించు నధికంబుగాను. 10
పంచద్వారములందు బాగుగావృత్తి
జ్ఞానంబు కల్గునో కాంచంగనపుడు
సాత్వికగుణము వంచనలేనియట్టి
అభివృద్ధిగాంచినదని తెలియనగు. 11
పార్థ! రజముతాను వర్ధిల్లినపుడు
జనునిలో లోభము శాంతమాశయును
కామ్యకర్మ ప్రవృత్తి గలిగి వర్తించు
నిక్కంబుగా నంచు నెఱనమ్ముమీవు. 12
భూరిప్రతాప, తమోగుణ మధిక
ముగనుండు కాలాన మూఢత్వమున్ను
మతి మాంద్యతయును సోమరితనమున్ను
కనుగొన నరునందు కనిపించుచుండు. 13
సత్వగుణము వృద్ధి జరిగెడు నపుడు
తనువును జీవుండు త్యజియించెనేని

ఆతండు సుజ్ఞాను లందంగ దగిన
పరిశుద్ధ లోకాల బడయుచున్నాడు. 14
పార్థ రజోగుణ ప్రాబల్యమున్న
కాలాన మనుజుండు గతియించెనేని
కామ్యకర్ములకును గలుగుచున్నాడు.
అట్లె తమోగుణమధికమైయుండి
మరణించువాడు పామరులందు మరియు
పశువులందున జన్మబడయుచున్నాడు. 15
సాత్వికాదిగ గుణసంయుతముగను
చేయు కార్యాలకు చెప్పుచుండెదరు
అధికమౌ సుఖదుఃఖ మజ్ఞానములను
క్రమముగా ఫలముల గాండీవిధరను. 16
సత్వగుణముచేత జ్ఞానంబుగలుగు
గురులోభమును రజోగుణమున గల్గు
మూర్ఖత్వ మజ్ఞానమును తమోగుణము
చేగల్గుచుండును శీఘ్రంబు గాను. 17
మరణించి నంతట మనుజులయందు
సత్త్వగుణుందూర్ధ్వ జగతికింజనును.
మనుజలోకాననే మరల జన్మించు
చుండును తిరిగి రజోగుణుడు, పశు
పక్షిజన్మాలను బడయుపాతాళ
మందు తమోగుణు దలఘు ప్రతాప! 18
జ్ఞానియగు నతడు సత్వాది గుణము
లకుమించి యొరుని తలపడొకర్తగను
ఆ గుణములకంటెనన్యుని గాను
తగినట్లు తనుతానె తలచుచున్నాడొ
వాడె మోక్షమునొందు వాడు నిజముగ. 19
తనువు లేర్పడుటకు తగు కారణంబు
లగు నీ త్రిగుణముల నవలీల దాటి
పుట్టుక చావును ముసలితనంబు
మొదలగునవిలేక ముదము తోడుతను
మోక్షంబు జీవుండు పొందుచున్నాడు. 20

అన విని యర్జునుందనియె కృష్ణునకు
దేవదేవా నాకు తెలుపుము కృష్ణ!
ఈ త్రిగుణాతీతుదెట్టుల నుందు
అతని ప్రవర్తన మదియెట్టులుందు
ఈ మూదు గుణముల నేరీతి దాటు
నన భగవానుదిట్లని చెప్పసాగె. 21
పార్థ! యెవ్వాదు సంప్రాప్తంబులైన
త్రిగుణాల కార్యాల ద్వేషింపబోదొ
అవి లేకపోయిన నాత్మ కుందకను
ఆత్మయందే తృప్తినందు నెవ్వందు
గౌరవాగౌరవ కష్ట నష్టముల
చలనంబు లేక నిశ్చలుదగు నెవదు
కామ్యకర్మలవీద గలుగు నెవ్వందు
బ్రహ్మనిష్ఠవిదని వలతి ఎవ్వందు
తెలిసి వానినె గుణాతీతుదటంచు.
పల్కుదు రార్యులు పాందుతనూజ. 22-23-24-25
భక్తియోగముచేత బాగుగానెవదు
చలనంబు లేకుంద సల్పునో సేవ
ఆతదే గుణములనన్నింటి దాటి
వసుధలోపలను జీవన్ముక్తుదగును. 26
ఎట్లనగా విను యేను శాశ్వతము
నిర్వికారంబును నిరతి శయమగు
ఆనందరూపమైనట్టి బ్రహ్మమున
కాశ్రయంబుగ నుంటినని నీవెరుగుము. 27
ఉపషత్సారంబు. యోగ శాస్త్రంబు
నగు భగవద్గీతలందు పార్థునకు
శ్రీకృష్ణ పరమాత్మ చెప్పిన గుణత్ర
యవిభాగయోగమియ్యది ధరలోన
మంజరీ ద్విపదయై మహినివెల్గొందు.



# 15

# శ్రీ భగవద్గీత

## 15వ అధ్యాయము

## పురుషోత్తమ ప్రాప్తి యోగము

భూమిని శాఖలు మూలంబు పైకి
గలిగియు పత్రాలుగా వేదములును
అమరియుండెడిదగు ఆదిలేనట్టి
సంసారమను రావిక్ష్మాజంబు నెవ్వ
డెరుగునో వేదార్థ మెరుగునాతండె. 1
గుణముల బెరిగెడి కొమ్మలున్నదియు
విషయ పల్లవముల వెల్గొందు నదియు
ధరనుండి మింటికి దాకెడు నదియు
కర్మవాసనలను గల్గించు నదియు
వినువీధికింజొచ్చు వేళ్ళుకలదియు
నగుచు నద్భుతముగా నావృక్షమొప్పు. 2
ధరణిలో సంసార తరువిద్దియాది
మధ్యాంతములు లేక మసలుచునుండె
సంగరహితమను శస్త్రంబు తోడ
ధీరుడైఛేదించి, తెలివితోడుతను. 3
తిరిగి జన్మములేని తెరవెద్దియౌనొ
ఎవనిచే నీ వృక్షమేపును గనెనొ
అట్టివాని శరణమందియు భక్తి
ఆది పురుషు పదమరయంగ వలయు. 4
అహము నజ్ఞానంబు నణచిన వారు
ఆశ్రయంబియ్యదియని లేని వారు
సుఖదుఃఖ ద్వంద్వాలు సురిగిన జ్ఞాను
లవ్యయంబగు బ్రహ్మానందుచున్నారు. 5
అర్జున! సూర్య చంద్రాదులు దేని
చేయలేరో ప్రకాశించు నట్లుగను

దేని చేరినవారు తిరిగింక రారొ
అదియె మత్‌శ్రేష్ఠమైనట్టి స్థానంబు. 6
అవని నాదుసనాత నాంశమే పార్థ
జీవలోకంబున జీవుండ గుచును
ప్రకృతియందున నున్న పంచేంద్రియాల
మనసుతోసహ లాగు మానకుండగను. 7
ధరణిలో జీవాత్మ తనువును వీడి
వేరు దేహముపొంద వేంచేయునపుడు
తీసికొంచేగు నింద్రియ మనములను
గాలి వాసనలను గ్రహియించునట్లు. 8
జీవుండు కంటిని, చెవిని, చర్మమును
నాశికన్, మనసును, నాల్కను బొంది
శబ్దాది విషయాల సమ్మదమునను
భోగించుచున్నాడు పుష్కలంబుగను. 9
విడచి యొక్కతనువు వేరొక్కతనువు
నాశ్రయించుచు విషయాల భోగించు
నితనిని పామరులెరుగంగ లేరు.
జ్ఞానులౌ వారలే గమనింపగలరు. 10
ఆత్మగాంచగయత్నమాచరించుయతు
లరయుచుందురు వారియందునేదాని
ఆ రీతిగా యత్నమాచరించియును
చూడజాలరు చిత్తశుద్ధి లేకున్న. 11
జగముల వెల్గింప జాలియున్నట్టి
భాస్కరునందున ప్రభయెద్ది గలదొ
చంద్రాగ్నులందు తేజములెవ్వి గలవొ
అవియన్ని నావిగా నరసికొమ్మీవు. 12
భూతజాలంబును పొందినే వాని
ఆత్మశక్తి వలన నాపుచున్నాడ
మరియునే నాచంద్రమస్వరూపుండ
నయిసాకు చున్నాడ నఖిల సస్యముల. 13
జఠరాగ్ని రూపాన జనులలో నేను
అధివసించుచు వారలారగించు పలు

విధములౌ వానిని వేగంబుగాను
పచనంబు గావింతుబాగుగా పార్థ! 14
ప్రాణుల హృదయాల వసియించి నేనె
మరపు తెలివి జ్ఞప్తి మానకన్ గూర్తు
ఏనె వేదాలచే నెరుగదగుదును
కొసకు వేదవిదుడు గూడనే నౌదు. 15
అర్జునా క్షరుడని, అక్షరుండనియు
ఇద్దరు పూరుషులెనయుచున్నారు
అందు క్షరుడనదేహమగును అక్ష
రుండన జీవుడౌ రూఢిగా తెలియ. 16
పార్థ లోకాలను భరియించు నాత
డెవ్వడో కాంచగ నీక్షరాక్షరుల
కిద్దరకు వెలిగా నెవ్వడున్నాడొ
అవ్వాడె పరమాత్మయగును తెలియగ 17
కవ్వడీ యా క్షరాక్షరులను వారి
కంటె మిన్నగవెల్గు కారణంబునను
పురుషోత్తముండని పొగడును నన్ను
వేదాలు లోకాలు వేవిధములుగ. 18
ఎవ్వడజ్ఞానంబు నెనయకీగతిని
పురుషోత్తమునిగనన్ పూర్తిగా నెరిగి
నట్టి వాడయి నను నత్యంత భక్తి
భజియించుచుండును పవలునురేలు. 19
అనఘ చరిత్ర నీ కతి గోప్యమైన
శాస్త్రమిప్పుడు బోధ సల్పితిన్నేను
ఎవడు దీనిని మదినెరుగునోజ్ఞాని
యైకృత కృత్యుడౌనతడు మీదటను. 20
ఉపనిషత్సారంబు, యోగశాస్త్రంబు
నగు భగవద్గీతలందు పార్థునకు
శ్రీకృష్ణ పరమాత్మచే చెప్పబడిన
పురుషోత్తమ ప్రాప్తిపొసగు యోగమిది
మంజరీ ద్విపదయై మహిని వెల్గొందు.



# 16

# శ్రీ భగవద్గీత

## 16వ అధ్యాయము

## దైవాసుర సంపద్విభాగ యోగము

అర్జునా! భయము లే కలరారుటయును
బైట లోపలశుద్ధి వదసియుంటయును
దయతోడ సర్వభూతముల జూచుటయు
కొండెముల్ వాకొన కుండనుండుటయు
అధ్యయనము జ్ఞానయజ్ఞంబులెపుడు
గావించుటయు శాంతిగలిగి యుండుటయు
ప్రతిభ తపంబుల వదలకుండుటయు
విషయ లోలత్వాల విడనాడుటయును
సిగ్గుచాపల్యము చెందకుండుటయు
బ్రహ్మతేజముతోడ భాసిల్లుటయును
ఏరికేనియు ద్రోహమెంచకుండుటయు
స్వాతిశయము వీడ జాలి యుండుటయు
ననునవిదైవాంశ మందు జన్మించు
వారికే గలుగును వసుధాతలమున. 1-2-3
అర్జునా దంభగర్వాభి మానములు
క్రోధ మజ్ఞానమన్ గుణములన్నియును
అసుర సంపద బుట్టినట్టి వారలకె
కలుగుచు నుండును కనగలోకమున 4
దైవసంపదయు బంధాలను దూల్చు
అసురసంపదయు బంధాలను గూర్చు
నని చెప్పగాబడె, నర్జునా! దైవ
సంపదచే నీవు జననమందితివి
కావున చింతింప గా పనిలేదు. 5
అవనిలోపలను దైవాసురులనెడి
ద్వివిధ సృష్టుల లోన తెల్పితిన్ మున్నె

దైవ సంబంధము, తరువాతనిపుడు
అసురసంపద గూర్చి ఆలింపుమీవు. 6
అసుర గుణములున్న అవనీ జనములు
ధర్మంబుగాని యధర్మంబు గాని
అరయ జాలరు, వారియందు శౌచంబు
గాని, ఆచారము గాని సత్యంబు
గాని యుండదు చూడగా పాండుతనయ. 7
జగతికి కర్తయీశ్వరుడు గాడనియు
స్త్రీలు పురుషులును సృష్టించిరనియు
పాప పుణ్యంబులు వసుధలేవనియు
పలుకుచుందురు వారు బహుతీవ్రముగను. 8
అట్టి నాస్తికమత మాశ్రయించు నరు
లల్ప మనస్కులత్యధిక క్రూరులును
అరులౌచు జన్మంబులందుచుందురు ప్ర
పంచ నాశనముకై పార్థ కనంగ. 9
ఆశ్రయించియు కామమ వ్వారుదంభ
మభిమానమును మదమధికమైరేగ
చెడుపట్టుదలలను చేపట్టి విడక
నీచమౌ వృత్తుల నెరపుచున్నారు. 10
మరణించు నందాక మగిడిపోనట్టి
విషయాభిలాషల ప్రేమతో గూడి
కామమున్ మించెడి ఘన సౌఖ్యమెదియు
పుడమి లోపల జూడ పూజ్యంబటంచు
అర్థానిపొందగా నను వగు నట్టి
ధనసమూహముల నధర్మమార్గముల
గైకొనుచుండిరి కఠినాత్ములగుచు. 11-12
ఈ కోరికంబొంది తిప్పు దటంచు
తరువాత పొందెద దాని నటంచు
ఇంతసంపద యుండె నిప్పుదటంచు
ఎంతయో గూర్చెద నికముందటంచు
ఈ శత్రువునుజంపి తిప్పుద టంచు
ఈ ధరాస్థలికెల్లయేనె రాజంచు
భూరిభోగాలిప్డు పొసగె నటంచు

చాలరీతుల చిత్తచాంచల్య మూని
కామసౌఖ్యంబె ముఖ్యంబుగా దలచి
సతి సుతాదుల తోడ సతమత మగుచు
ఘోర నరకమునకుం జేరుచుంద్రు. 13-14-15-16
తముతామె గొప్పగా తలచెడి వారు
కాసులు గలవంచు గర్వించు వారు
కందమదాన కన్ గనకుండు వారు
కామాది గుణములు కల్గినవారు
అంతట గల్గు నన్నరయని వారు
దైవదూషణ చేయ దలచెడువారు
జార చౌర్యాలకై జరిగెడి వారు
శాస్త్రాఽహితపు కర్మ సల్పెడి వారు
అసుర సంపదచేత నవతరించిరని
నెమ్మది నెరుగుము నీవింక మీద. 17-18
ప్రాణులన్నిటియందు వరలెడి నన్ను
దూషించుచున్న యాదుష్టుల నెల్ల
మృత్యు స్వరూపమై మెలగుచు నున్న
నీచ జన్మలలోన నే(త్రోచి వైతు. 19
సవ్యసాచి! యసుర సంబంధ మైన
పుట్టువుల్ గాంచెడి మూర్ఖులౌ జనులు
పొందజాలకనుయే పుట్టువున నను
అంతకంతకు నీచులై పుట్టుదురిల. 20
అర్జునా! కామాదులను మూడు నరక
మునకు ద్వారంబులై మొనయుచునుండు
జీవునకివి పెద్దచేటు గల్గించు
కాన వానినివీడ కల్గును శుభము. 21
ఈ మూడు ద్వారాల నెవ్వండు చొరడొ
అవ్వాడె భువిని సౌఖ్యాలెల్ల పొంది
మరణించి నప్పుడు మరలిరానట్టి
మోక్ష సుఖంబును పొందుచున్నాడు. 22
ఎవడు శాస్త్రమువీడి యిష్టమగునటు
వర్తించు చుండునో వాడు పొందంగ

జాలదు పురుషార్థ సంసిద్ధి గాని
ఉత్తమ మోక్షంపుటునికినిం గాని. 23
చేయదగిన దేదొ చేయరానిదెదొ
నిర్ణయింపగ శాస్త్ర నియతియొుండుండె
కాన దానినెరిగి కావింప సర్వ
కర్మలన్ తగునీకు గాండీవిపుడమి. 24
ఉపనిషత్సారంబు, యోగ శాస్త్రంబు
నగు భగవద్గీతలందు పార్థునకు
శ్రీకృష్ణ పరమాత్మచే చెప్పబడిన
దైవా సురుల సంపద విభాగయోగ
మనుపేర బరగెడి నట్టిదౌ నిద్ధి
మంజరీ ద్విదయై మహిని వెల్గొందు.

(17)

# శ్రీ భగవద్గీత

## 17వ అధ్యాయము

## శ్రద్ధాత్రయ విభాగ యోగము

శాస్త్రోక్తమైనట్టి సరణితో గాక
శ్రద్ధతో పూజలు జరిపెడి వారి
స్థితియెట్టిదో నాకు తెలుపుమటంచు
ప్రశ్నించు పార్థుని బాగుగాజూచి
కృష్ణుండు వచియించె ధృతరాష్ట్రభూప. 1
పూర్వ సంస్కారాన పుడమిలో శ్రద్ధ
కలుగును భూత నికాయమునకును
సాత్వికంబును రాజసంబును మరియు
తామసంబనగను తగ మూడుగతుల
వానిని చెప్పెద వరుసగా వినుము. 2
పూర్వసంస్కారాన పుట్టుచు నుండు
శ్రద్ధ జీవునకు, నా శ్రద్ధను మించి
వేరొక రూపంబు వెదకినన్ లేదు.
ఆశ్రద్ధ యెట్టిదో ఆతడట్లుండు. 3
తిలకింప సాత్వికుల్ దేవతావళిని,
రాజసుల్ యక్షులరాక్షసాదులను,
తామసుల్ ప్రేతభూతంబుల భక్తి
కొలుచుచుండిరి చూడ కువలయంబునను.
తనువులోగల్గు భూతంబులైదిటిని
అందులోనే యుండునట్టి నన్గూడ
ఘోరోపవాసాలకుం గురిచేసి
బాధించుచున్నారు పామరుల్ పార్థ. 5
కామ రాగంబులు గలిగిన వారు
పశు బలంబును గల్గి ప్రబలిన వారు
జ్ఞానవిహీనులై శాస్త్ర వైరుధ్య

తపములు సాగించి తమకు నితరుల
కుం గూడ బాధలు గూర్చుచున్నారు.
వారెల్ల నసుర స్వభావులగుదురు. 6
కోరుదురు జనులు గుణములంబట్టి
ఆహారమున్ గూడ అవనిమువ్విధము
లట్లె తపముదాన యజ్ఞాలు మూడు
విధముల నిష్టమౌ వినుము చెప్పెదను. 7
ఆయురారోగ్యాల నభివృద్ధి పరచ
గల్గినవియు, ప్రీతి గల్గించునవియు
బలమును తెలివిని వర్ధిల్లజేయు
నట్టియాహారంబులగునుయిష్టంబు
సాత్వికాళికి సర్వ సమయంబులందు. 8
పులుపుచేదును, నుప్పుపొసగినవియును
కారంబు నుష్ణంబు గల్గినవియును
దాహదుఃఖంబుల దరికొల్పునవియు
నైన పదార్థంబు లగుచుండు నిష్ట
మఖిల రాజసులకు నర్జునా మరియు. 9
పక్వంబుకానిది పాచినట్టిదియు
రాత్రివండినది దుర్గంధమైనదియు
నైన పదార్థంబు లగుచుండు నిష్ట
మెల్లతామసులకు నిహమున జూడ. 10
ఇదిచేయదగుననియెంచి చిత్తమున
నిర్ణయంబునులెస్సనిలిపియు శాస్త్ర
విహితంబుగా ఫలము వీడిచేయంగ
అది సాత్వికపు యజ్ఞమని చెప్పబడును
దాంబికంబునకునై ధాత్రి నేయజ్ఞ
మాచరింతురొ ఫలమభిలషించుచును
అదియె రాజసయజ్ఞమంచును నీదు
చిత్తంబులో నెంచ చెల్లును పార్థ! 12
శాస్త్రోకముంగాక శ్రద్ధయున్ లేక
తగుదక్షణలును మంత్రాలును లేక
అన్నదానంబు రవంతయున్ లేక
సల్పుయజ్ఞము తామసంబనదగును. 13

భక్తి తోడుతను దేవతలను, ద్విజుల,
జ్ఞానుల, గురుల, పూజలు సేయుటయును,
బ్రహ్మచర్యంబును, పాలించుకొనుట
సర్వజీవులయందు జాలిచూపుటయు.
దేహతపస్సని తెలుపంగబడియె. 14
పరుల మనస్సును బాధింపనిదియు
హితమును ప్రియమును హెచ్చించునదియు
నగు సత్యవాక్కు వేదాధ్యయనమును
కలిగినచో అది కౌంతేయ వినుము.
వాచిక తపసని వాకొనంబడియె. 15
నిర్మలముగ మది నిలుపుకొనుటయు
ముఖము ప్రసన్నత్వముగ నుంచుకొనుట
పరమాత్మ ధ్యానంబు బాయకుండుటయు
శుద్ధమౌ భావాల శోభిల్లుటయును
మానస తపమని మహనీయులంద్రు. 16
ఫలితమాశింపని భవ్యులౌ వారు
దైవభావన నుండి తలగని వారు
నిశ్చలాత్మకులు నై నెగడెడి వారు
నైన మనుజులచే నాచరింపబడు
తపములు మూడు పెద్దలచేత చెప్ప
బడియె సాత్వికమని బాగుమీరంగ. 17
పరులచే సత్కరింప బడవలెనని
గౌరవంబును పొంద గల్గవలె నని
పూజలు గొప్పగా పొందవలె నని
దంభముతో చేయు తపమదెపుడును
అస్థిరంబైన ఫలాన్వితమగుచు
రాజస తపమంచు లక్షింపబడియె. 18
మూర్ఖపు పట్టుతోమొనసి దేహమును
బాధించుకొనియెడి భావాన గాని
అటుగాక నితరులనంతం బొనర్చు
భావంబుతోగాని బహు తీవ్రముగను
ఆచరించెడి తపమగును తామసము. 19

ఈయ దగినదంచు నెంచియెద్దాని
పుణ్యదేశంబున పుణ్యకాలమున
ప్రత్యుపకారంబుపచరింప శక్తి
చాలని వానికి సల్పంగ బడునొ
అది సాత్వికపుదానమని చెప్పబడును. 20
ప్రత్యుప కృతిలోన భావించి గాని
తగుఫలితంబును తలపోసి గాని
చేసెడి దానంబు చెప్పగాబడియె
రాజసమని సురరాజతనూజ! 21
తెలుపుదు నపవిత్ర దేశ కాలముల
తగనివారలకు సత్కారశూన్యముగ
గౌరవ హీనంబుగా చేయబడిన
దానంబు తామస దానంబటంచు. 22
ఒప్పుగా భువిలోన ఓమ్‌తత్తనియును
సత్తనియును పేర్లు చక్కగా నుండె
ఈ నామత్రయముచే నెల్లవేదముల
ఆ పరబ్రహ్మకు. నవ్వాని నుండి
బ్రాహ్మణుల్ వేదాలు బహుయజ్ఞములును
నిర్మింపబడినవి నేరుగా పార్థ! 23
అందుచే వేదంబు లరసిన వారు
యజ్ఞదాన తపంబులన్నియు నెప్పు
డాచరింపగబోవ రాది ఓమ్‌కార
మనుసరింపకను తామాత్మలందునను. 24
ముక్తసంగులు నగు మునులు ఫలితము
విడచియును ననేక విధములైనట్టి
యజ్ఞదాన తపములన్ని చేయుదురు
'తత్'ను మొదట పల్కి తప్పకుండగను. 25
అర్జునా! కలదను నర్థంబు నందు
మంచిదియనునట్టి మార్గంబు నందు
ఉత్తమంబనియెడి యుక్తియందునను
'సత్త'ను పరబ్రహ్మ సారాంశమైన
అర్థంబు పల్కుదు రార్యులందరును. 26

యజ్ఞదాన తపస్సులందుండు నిష్ఠ
కూడ సత్తనిచెప్పుకొనుచుందురింక
బ్రహ్మ కొరకు చేయబడు నట్టి కర్మ
నైనను సత్ అనియనుచు నుందెదరు. 27
అర్జునా! ఆలింపుమ శ్రద్ధతోడ
గావించు యోగంబు గాని, దానంబు
గాని తపముగాని కర్మలుంగాని
జగములోనవియు నసత్తన బడును
ఇహపరముల సుఖమిడ లేవవెపుదు 28
ఉపనిషత్సారంబు, యోగ శాస్త్రంబు
నగు భగవద్గీతలందు పార్థునకు
శ్రీకృష్ణపరమాత్మచే చెప్పబడిన
శ్రద్ధాత్రయ విభాగ సంజ్ఞయోగమిది
మంజరీ ద్విపదయై మహిని వెల్గొందు.

## 18

# శ్రీ భగవద్గీత

## 18వ అధ్యాయము

## మోక్ష సన్యాస యోగము

దీర్ఘ బాహుడవు నింద్రియజయుడవును
కేశిసంహారుడౌ కృష్ణ సన్యాస
త్యాగంబులను రెంటి యదార్థ్యమెరుగ
దలచుచుంటినినేను దయతోడచెపుము. 1
అని పార్థుడడుగగాననె కృష్ణుడిట్లు
పండితుల్ కొందరు ఫల్గుణావినుము
కామ్యకర్మములను కడకు నెట్టుటయె
యగును సన్యాసమం చనుచునుండెదరు
మరికొందరంద్రు సమస్త కర్మముల
యందు ఫలము వీడ త్యాగంబటంచు. 2
మరియు కొందరు బుద్ధిమంతులౌవారు
కర్మను దోషంబు కరణిగా వీడ
వలయునటంచును వాకొనుచంద్రు.
యజ్ఞ దాన తపంబులను కర్మములను
వదల రాదంచును వచియించుచుంద్రు
కొందరు పండితుల్ కొమరొప్పగాను. 3
భరతకులోత్తమా! బాగుగా వినుము
అట్టి కర్మత్యాగమందున నాదు
నిశ్చయ మేదియో నీకు విన్పింతు
అది మూడు విధములంచను చంద్రుగాదె. 4
యజ్ఞదాన తపస్సులనెడి కర్మములు
త్యాగంబు చేయంగ తగినవి కావు
బుద్ధిమంతులకవి, పుడమియందునను
చిత్తశుద్ధిని గల్గజేయుచు నుండు. 5

ఇపుడు చెప్పబడిన యే కర్మలైన
పార్థ! కర్తననెడి భావంబు గాని
ఆ కర్మఫలమునందాసక్తి గాని
లేక నెమ్మదిలోన లేశంబు గూడ
ఆచరింపగవలె నని నాదు మతము. 6
వేదశాస్త్రములందు వివరింపబడిన
కర్మను విడచుట కాదుయుక్తంబు
విడచిన యెవడేని వేదురు దగుచు
అది తామస త్యాగమని చెప్పబడును. 7
అర్జునా, యెవడు ప్రయాస కోర్వకను
కాదని శాస్త్రోక్త కర్మలన్ విడునొ
అట్టిడు రాజస త్యాగితానగుచు
పదయజాలడు త్యాగఫలమును సుంత. 8
ఇది సేయదగినదియే యంచు తలచి
శాస్త్రోక్త మేకర్మ సల్పంగ బడునొ
అభిమాన ఫలములందాసక్తి విడచి
అది సాత్విక త్యాగమని చెప్పబడును. 9
సత్వగుణుండు, ప్రజ్ఞాశాలి, సంశ
యములెల్ల వీడిన త్యాగశీలుండు
అశుభమును మరికామ్యంబును దుఃఖ
కలితమౌ కర్మను కాదన బోడు
శుభము నిష్కామంబు సుఖకరంబైన
కర్మయందాసక్తిగాంచంగ బోడు. 10
కర్మంబులను పూర్తిగా వీడ దేహ
ధారికెవ్వనికి సాధ్యంబును గాదు
ఫలితమున్ వీడిన వాడెయౌత్యాగి
యంచు పల్కుచునుందు రార్యులందరును 11
ఇష్టమైనదని య నిష్టమై దని
మిశ్ర మంబనియును మేదినియందు
కలుగుచుండును మూడుగతులుగా త్యాగి
కానివానికిచచ్చు కాలంబు వరకు

కర్మ ఫలంబులు గమనింపగాను.
త్యాగియౌ వానికీ తగులముల్ లేవు. 12
గొప్ప బాహువులున్న కుంతీ తనూజ!
సకల కర్మంబులు సమకూరుటకును
కర్మబంధంబుల ఖండించుటకును
సాంఖ్యయోగము దెల్పు చక్కనైనట్టి
ఐదు కారణముల నాలింపుచెపుదు. 13
తనువు, కర్తయు, వివిధంబులైయున్న
ఇంద్రియాల్, కర్మలనేకముల్ మరియు
దైవమున్, కారణాల్ తత్కర్మకనుచు
పలుకంగబడియుండె వరుసతోడుతను. 14
మనిషి దేహము వాక్కు మనములచేత
న్యాయ కర్మముగాని యన్యాయ కర్మ
గాని తలంచునో, కారణాల్ దాని
కీ యైదెయగుచుండు నెయ్యెడ నైన. 15
అదిగాక నెవడుతా నకృతపు బుద్ధి
నిరుపాధి కుండయి నెగడెడి నట్టి
ఆత్మను కర్తయంచనుకొను, నాత
డరయంగ జాలడయ్యాత్మకుం గాని
కర్మకుంగాని నిక్కమగు రూపమును. 16
ఎవడు తా కర్తగా నెంచుకోబోడొ
కాంచనెవనిబుద్ధి కర్మలంటని దొ
ఆతడీ ప్రాణుల నన్నింటి గూడ
చంపినన్ నిజముగ చంపుటలేదు
పాపంబుచే వాడు బంధింపబడడు. 17
కర్మకు హేతువుగానుండె, తెలివి,
తెలియదగినదియు, తెలియువాడనియు
త్రివిధంబుగానుండె, తెలియంగ నట్లె
కర్మమునకు నుపకరణము క్రియయు
కర్తయనియు మూడు కారణాలుండె. 18
సాంఖ్యయోగమునందు జ్ఞానమున్, కర్మ,

కర్తయను, నవియుగాంచ సత్వాది
గుణ భేదములతోడ గూడిన వగుచు
త్రివిధములయియుండె తెల్పెదవాని. 19
విభజింప బడివేరు వేరుగానున్న
సకల చరాచర సముదాయములను
ఒకటియై వెల్గొందుచున్నట్టి యాత్మ
విభజింప బడనట్లు విశదంబు గాను
ఏ జ్ఞానము వలన నెరుగుచున్నాడొ
అది సాత్విక జ్ఞానమని తెలియుమిక. 20
మనుజుడెద్దాన సమస్తంబు నందు
వేర్వేరు విధముల వెల్గొందు చున్న
జీవుల వేరుగా చెప్పంగ గలడొ
అది రాజసజ్ఞానమని చెప్పబడును. 21
తగు హేతువుల్ లేక తత్వమెరుంగ
కుండ నల్పఫలము గూర్చంగ గలుగు
కార్యము నొకదాని కాంక్షించిచేయు
జ్ఞానంబు తామస జ్ఞానమేయగును. 22
శాస్త్రవిధిని ఫలా సక్తియుంగాని,
సంగమున్, రాగ ద్వేషంబులు గాని
లేశమైన తనకు లేక నొనర్చు
కర్మనే సాత్విక కర్మమ నుదురు. 23
ఫలముగోరెడివాని వలననుంగాని
కర్తనేననుబుద్ధి కలిగిన వాని
వలనగాని, యధిక బాధతో చేయు
కర్మమే రాజస కర్మ మనబడు. 24
ముందురాబోయెడి ముప్పునుం గాని
ధననష్టముంగాని, తాను నితరులు
తప్పకన్ బొందు బాధలనైన గాని
తనదుశక్తినిగాని తానెరుంగకను
చేసెడి కర్మను చెప్పుచుండెదరు
తామసకర్మగా తద్దయు, బుధులు. 25

ఫలమునందాసక్తి వదలిన వాడు
కర్తనేననుబుద్ధి కలుగని వాడు
ధైర్య, ముత్సాహము తరుగని వాడు
ఫలియించి ననుకర్మ ఫలియింపకున్న
నిర్వికారుండయి నిలచెదు వాడు
నగు కర్త సాత్వికమగు కర్త యగును. 26
నెనరు చుట్టాలపై నెరపెడి వాడు
కర్మఫలంబును కాంక్షించు వాడు
మహితమౌ లోభము మదిగల్గు వాడు
కటిక స్వభావము కలిగిన వాడు
హర్షశోకాన్వితమగు బుద్ధి వాడు
నగు కర్త రాజసమగు కర్త యండ్రు. 27
మదిని నిగ్రహముగ మలచిన వాడు
పామరత్వపు స్వభావముగల్గు వాడు
దిగులుతో నెల్లప్డు తోచెడి వాడు
సోమరి తనముతో చూపట్టు వాడు
మొలచిన యధికమౌ మోహంబు వాడు
తామస కర్తగా తలచగ బడును. 28
అర్జునా! బుద్ధి ధైర్యములకుం గూడ
గుణముల బట్టియు గుర్తింప బడియె
భేదాలు మూడేసి వేర్వేరు గతుల
సంపూర్తిగచెపుదు చక్కగా వినుము. 29
ధర్మ ప్రవృత్తి యధర్మ నివృత్తి
భయ మభయంబును బంధ మోక్షములు
ఏ బుద్ధి ధృవముగా నెరుగుచున్నదియో
ఆ బుద్ధి సాత్వికమైనది యగును. 30
ధర్మమౌ దాని నధర్మంబు గాను
ఏ బుద్ధితోడుత నెరుగుచున్నాడొ
ఆ బుద్ధి రాజస మని చెప్పబడును. 31
అర్జునా! యే బుద్ధియవివేక యుతమై
ధర్మమౌ దాని నధర్మంబుగాను

చెడ్డదౌ దానిని శ్రేష్ఠంబుగాను
తలచునో సర్వ పదార్థాల నదియె
తామసబుద్ధిగా తగ చెప్పబడును. 32
ప్రాణేంద్రియ మనస్సు పనులన్ని గూడ
యోగసాధన చేత బాగు మీరంగ
ఆత్మలో నిల్పు ధైర్యంబదియేదౌ
అదియె సాత్త్విక ధైర్యమని చెప్పబడును. 33
ఫలిత మాశించుచు ప్రతి దినంబునను
ధర్మార్థ కామమత్యధికమౌ ప్రీతి
ఆచరించెడి ధైర్యమది చెప్పబడియె. 34
రాజసమని సురరాజ తనూజ!
దుర్బుద్ధి, మనుజుడు దుఃఖము భయము
మదము సంతాపంబు మరియును నిద్ర
విడువంగ జాలడో విజయ అయ్యదియె
తామసధృతియని తలపంగ వలయు. 35
అవనిలో యెద్దాని అభ్యాసమునను
ఆనందమును హృదినందునో నరుడు
దుఃఖలేశము గూడ తొలగునో అట్టి
త్రివిధ సౌఖ్యాలను తెల్పెదన్ వినుము. 36
ప్రారంభమున విషప్రాయమైయుండి
తుదకు నమృతముగా తోచునదెదియొ
తన బుద్ధి నిర్మలత్వము నొందగాను
అదియె సాత్త్విక సుఖమనజెల్లు చుండు. 37
ఏ సుఖమది విషయేంద్రియాన్వితమై
తొలుత నమృతముగా తోచియున్ పిదప
విష సన్నిభంబౌచు విముఖత్వమిదునౌ
అదియె రాజస సౌఖ్యమని నీ వెరుగుము. 38
మహిని నిద్రాలస్య మత్తత వలన
జన్మించి ఆరంభ సమయము నందు
అంత్యాన గూడ మోహము గూర్చునెదియొ
అదియె తామస సౌఖ్యమని చెప్పబడియె. 39

ప్రకృతి జనించిన ప్రాణియొకటియు
గూడ నీ త్రిగుణాల గూడ కుండెడిది
వసుధ లోపలగాని, స్వర్గాన గాని,
సురలయందున గాని, చూడగాలేదు. 40
బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రులకు
వారి వారలగుణ వైఖరిం బట్టి
వేరువేరుగ పనుల్ వివరింపబడియె
అవ్వాని పల్కెద నర్జునా వినుము. 41
శమ దమ తపములు, సత్యభాషణము
శౌచము క్షాంతియు జ్ఞాన విజ్ఞాన
మాస్తికత్వములను నవి ఆది నుండి
సహజమౌ బ్రాహ్మణ జనుల కార్యములు. 42
శౌర్యము తేజము సామర్థ్యమున్ను
యుద్ధాన పారిపోకుండుటయున్ను
దానధర్మంబులు, ధైర్యంబు, ప్రజల
పరిపాలనంబు స్వభావంబు వలన
క్షత్రియ కర్మలై చెలగుచునుండు. 43
వర్తక సేద్యముల్ పశురక్షణమును
వైశ్యుల కర్మముల్ వసుధ ని కటులె
శూద్ర జనులకెల్ల శుశ్రూషయొకటె
సహజమౌ కర్మగా సమకూరియుండె. 44
తనదు సహజ కర్మతగు విధానమున
ఆచరించెడి వారలందంగ గలరు
జ్ఞానయోగపు సిద్ధి, సక్రమంబుగను
తెలిపెద నద్దాని తెలిసి కొమ్మీవు. 45
ఎవనిచే కల్గునో యీ ప్రాణు లెల్ల
ఎవనిచేత వ్యాప్తి నెనయునో జగము
అట్టివాని సహజ మౌ కర్మచేత
సేవించి సిద్ధినిచెందు మానవుడు. 46
తన ధర్మము గుణము తక్కువ దైన
పరధర్మమునకంటె పరమ శ్రేష్ఠంబు

విడకచేయు నెడల స్వీయ ధర్మంబు
పాపంబు నరుడు తాపడయంగబోడు. 47
సహజకర్మము దోష సంయుక్తమైన
దానినెప్పుడు గూడ తప్పంగ రాదు
కనధూమ మగ్నిని గప్పిన రీతి
కర్మలన్నియు దోష కలితంబులౌను. 48
విషయ జాలమునెల్ల వీడిన వాడు
మనసునులోనికి మరలించు వాడు
కోరికల్ మొదలంటకోసిన వాడు
సంగమున్ త్యజింపజాలిన వాడు
నిష్క్రియాత్మ స్థితి నిజముగా పొందు. 49
అర్జునా! నిష్కామమగు కర్మచేత
పరమాత్మనేరీతి బడయంగ గలవొ
పర్యవసానంబు పరికింప నెదియొ
వాని క్లుప్తంబుగా వచియింతు వినుము. 50
అతి నిర్మలపు బుద్ధి నలరెడి వాడు
నిగ్రహంబుగ మది నిల్పెడి వాడు
వీడిన శబ్దాది విషయాల వాడు
రాగ ద్వేషాదులు రానట్టి వాడు
నిష్ఠ నేకాంతాన నివసించు వాడు
మిత భోజనంబును మెసవెడి వాడు
వశమైన తనుమనో వాక్యాల వాడు
సర్వదా ధ్యానంబు సల్పెడి వాడు
వైరాగ్యమున్ లెస్స వహియించు వాడు
బలము దంబములను వదలిన వాడు
అహముక్రోధము కామమణచిన వాడు
మమకారమున్ వీడి మసలెడి వాడు
శాంతంబు వీడంగ జాలని వాడు
పరమ పదము పొంద పార్థ! అర్హుండు. 51-52-53
బ్రహ్మరూపంబును బడసిన వాడు
దేని గూర్చినయట్టి దిగులును గాని
ఇదిపొంద వలెనను యిష్టంబు గాని

అసలె పొందకను తానన్నింటియందు
సమబుద్ధి యుతుడయి సర్వకాలంబు
ఉత్తమ మద్భక్తి నొందుచున్నాడు. 54
అట్టి భక్తిగలిగి యాతండు త్వరగ
యెట్టి వాడనొ నేను ఎరుగంగ గలడు
వాస్తవంబు నిటుల బాగుగా నెరుగ
చేరుచుండును నన్ను చివరకాతండు. 55
సర్వకర్మంబులు సర్వదా చేయు
వాడుగూడను నన్ను భక్తితో గొలువ
నా యనుగ్రహమున నాశంబులేని
మోక్షంబు నాతందు పొందుచున్నాడు. 56
అర్జునా, కర్మంబులన్ని నాయందు
పూర్తిగా వదలియు బుద్ధియోగంబు
చక్కగా బూనియు సతతంబు నీవు
చెదరనీయక మది చేర్చునాయందు. 57
చిత్తమాత్రియ నన్ను చేర్చితి వేని
నా దయచే దుఃఖ నాశంబు గలుగు
అటుగాక, నా పల్కులహముతోడుతను
చెవిజేర్చకుండిన చెడిపోదు వీవు. 58
అర్జునా ఒకవేళ నహమును బూని
అనిచేయనని మది ననుకొందువేని
వ్యర్థమౌ నట్టిప్రయత్నంబు కూడ
నీ స్వభావమె నిన్ను నియమించుగాన. 59
కవ్వడీ పూర్వ సంస్కారంపు బలిమి
ఇష్టపడవాదేని నిపుడు సేయంగ
దాని పరాధీనతను తప్పకుండ
చేసి తీరెదవని చెప్పుచు నుంటి. 60
ధర నీశ్వరుండు యంత్రారూఢులట్లు
మాయచే తాను సమస్త భూతముల
త్రిప్పుచు వాని హృద్దేశంబు లందు
వసియించు చున్నాడు భద్రంబుగాను. 61

అర్జునా! నీవింక నన్నిరీతులను
అయీశ్వరునె పొందనగు శరణంబు
సర్వోత్తమంబగు శాంతమోక్షముల
అతని వలననే యందంగ గలవు. 62
అతిరహస్యంబైన యట్టి జ్ఞానంబు
చెప్పంగ బడియె నాచేత నీకిపుడు
నీకిష్ట మగునట్లు నెరపు మామీద. 63
అర్జునా! నీవిష్టుడైనట్టి కతన
అతిగోప్యమును శ్రేష్ఠమగు వాక్యమొకటి
నీక్షేమ ముంగోరి నే చెప్పుచుంటి
మరల నద్దానిని, మహితప్రతాప!
ఆలింపు మిపుడు నీ వతి శ్రద్ధతోడ. 64
నన్ను నిల్పుముమది నాకిడునతులు
నన్ను భక్తిగొల్వు ననువిశ్వసించు
మీవు వొందెదవు నన్నిది నిజంబంచు
ప్రతిన చేయుచునుంటిపాండుతనూజ. 65
సకల ధర్మాలను సరగున విడచి
నను బొందు శరణంబు నయముగా నీవు
అట్లొనర్చితివేని అఘములన్నిటిని
చేతు విడచిపోవ చింతింప బోకు. 66
తపములే నతనికి తగినట్టి భక్తి
లేనివానికి శ్రద్ధ లేనివానికిని
ఎన్నడేనియు చెప్ప నెంచంగ రాదు
ఇపుడు నే చెప్పిన యీబోధ సుంత! 67
అతిరహస్యంబగు నట్టి యీ గీత
నెవడు మద్భక్తుల కెరిగింప గలడొ
అతడుత్తమభక్తి నలరారు వాడై
పోయిన సంశయములుగల్గు వాడై
ననుబొందుచుండును న్యాయంబుగాను. 68
ప్రజల లోపలనాకు బాగుగా ప్రియము
కల్గించు నవ్వాడె, కావున, నాకు

అతనికంటెను మించి నట్టి యిష్టుండు
ఎవ్వాడు కన్పించ డీ లోకమందు. 69
ఎవ్వాడు ధర్మమౌ నీ విషయంబు
నధ్యయ నముచేయు నట్టిదు నన్ను
ఆరాధనము జ్ఞానయజ్ఞంబు చేత
చేసినవాడంచు చెప్పెదన్ నేను. 70
అనసూయ పరుడయి అధికమౌ శ్రద్ధ
ఈ గీత నాలించు నేని యాశ్రోత
పుణ్య కార్యములను పొనరించువారు
పోవు లోకానికే పోవుచున్నాడు. 71
అర్జునా! యిప్పు దేకాగ్రచిత్తాన
అస్మదీయపు బోధ నాలించినావె
ఆత్మలోపల నీకు నలముకొన్నట్టి
అజ్ఞాన మంతయు నంతరించినద? 72
అని కృష్ణుడడుగగా ననె పార్థుడిట్లు
అచ్యుతా! నాదగు నజ్ఞాన మంత
తలగిపోయెను నీదు దయచేత, నిపుడు
జ్ఞానంబుచేకూరె, సంశయంబులును
అంతరించెను, నీదు ఆజ్ఞ నొనర్ప
ఆయత్తపడినాడ నంచుతా మ్రొక్కె. 73
ఓ కురుకులనాథ ఓ ధృతరాష్ట్ర!
పార్థుతో కృష్ణుండు పల్కినయట్టి
ఆశ్చర్యమును పుల కాంకురంబులును
కలుగంగ జేసెడి ఘన భాషణముల
నే వినియున్నాడ నికరంబు గాను. 74
వ్యాసుని దయచేత బాగుగా నేను
అతి రహస్యంబు నత్యధిక శ్రేష్ఠంబు
నగు యోగశాస్త్రంబు నర్జుననకును
చెప్పెడి యోగీంద్రు శ్రీకృష్ణు వలన
ప్రత్యక్షముగ వింటివరుసతోడుతను. 75
అలఘు పావనమైన యద్దాని నెంచి

ఆనంద పడుచుంటి నాత్మలోపలను
అంతియే గాకప్పు దర్జును నకును
శ్రీకృష్ణ పరమాత్మచే చూపబడిన
విశ్వరూపంబును వీక్షించి దాని
తలచి తలచియు నే తన్మయత్వంబు
చెందుచు నున్నాద చిత్తమందునను. 76-77
ఎచ్చోటనుండు యోగీంద్రుండు కృష్ణ
భగవానుడును, ధనుర్బాణాలు పూని
ఎచ్చోట నర్జునుం డెలమితో నుండు
అచ్చోటనేయుండు నఖిలసంపదలు
విజయంబు, స్థిరనీతి, విభవంబులంచు
నిజముగా మదిలోన నేదలంచెదను. 78
అని ధృతరాష్ట్రుతోననె సంజయుండు
ఉపనిషత్సారంబు యోగశాస్త్రంబు
నగు భగవద్గీతలందు పార్థునకు
శ్రీకృష్ణ పరమాత్మ చెప్పిన మోక్ష
సన్యాస యోగంబు సర్వస్వ మిద్ది
మంజరీ ద్విపగా మహిని వెల్గొందు.

ః సమాప్తం ః

హరిః ఓమ్ తత్ సత్

# శ్రీ భగవద్గీత

తెలుగు అనువాదము - మంజరీ ద్విపద



"మధుర కవి" "తెలుగు విశారద"

## మురకొండ నాగేశ్వరరావు

### కవి పరిచయము

- శ్రీ మురకొండ నాగేశ్వరరావు 1936 వ సం॥ ఇంకొల్లులో సుబ్బయ్య, లక్ష్మమ్మ దంపతులకు జన్మించారు.
- స్వయంకృషితో తెలుగు విశారదలో ఉతీర్ణులై పండితునిగా, కవిగా గుర్తింపు పొందారు. 1. సుబ్బరాయ శతకం 2. శ్రీశైలదర్శనం 3. నలదమయంతి (నాటకం), 4. శ్రీ భగవద్గీత (తెలుగు పద్యానువాదం) వంటి పలు రచనలు చేశారు.
- ఆకాశవాణిలో సమస్యాపూరణలతోపాటు వివిధ విషయాలపై పద్య ఖండికలు రచించారు.
- చిత్రలేఖకునిగా రంగుల కుంచెతో వందాలది చిత్రాలకు రూపకల్పన చేశారు.
- ప్రఖ్యాత కవి డా॥ నాగభైరవచే "మధురకవి" బిరుదుతో సత్కరింపబడ్డారు.
- పలు సాహితీ సంస్థలు, సాహిత్యాభిమానులచే ఉత్తమ కవిగా సన్మానాలు పొందారు.



"మధురకవి" మురకొండ నాగేశ్వరరావుగారు మంజరీ ద్విపదలో చేసిన భగవద్గీత తెలుగు అనువాదం మంజుల పద శోభాన్వితమైన సులభశైలిలో సాగింది. జటిలమైన సంస్కృత శ్లోకార్థాలను తేట తెలుగులోకి తెచ్చిన మురకొండవారి లేఖిని వాహినిలా ప్రవహించింది. జ్ఞాన వృద్ధులైన నాగేశ్వరరావుగారి అనువాద ప్రాఢిమ ప్రశంసనీయం.

- డా॥ సి. నారాయణరెడ్డి, డి.లిట్.

Printed at : Don Bosco Technical School Press, Guntur - 7. Ph: 0863 - 2350832

